చందా వివరములు
బుధవారపు సచిత్ర వారపత్రిక
రూ. [నయాపైసలు]
సంవత్సర చందా ... 13 00
అర్థ సంవత్సర చందా ... 6 50
విడి ప్రతి ... ,, 25
భారతి (సచిత్ర మాసపత్రిక)
సంవత్సర చందా ... 12 00
అర్థ సంవత్సర చందా ... 6 00
విడి ప్రతి ... 1 00
ఆంధ్ర పత్రిక — మద్రాసు-1.


# ఆంధ్రపత్రిక



31951


The Andhra Patrika - Madras సంపుటం 44. సంచిక 120 FOUNDER: DESODHARAKA K. NAGESWARA RAO బుధవారం 31-7-1957 Reg. No. M. 1118 6 పేజీలు 7 నయాపైసలు


# ప్రభుత్వోద్యోగులూ ఇతరులలా కూడా కష్టాలు భరించక తప్పదు

## రాష్ట్రంలో మొత్తం 30 మంది ఆడపోలీసులు

### పని బాగానే చేస్తున్నారని మంత్రి భావం

హైదరాబాదు, జూలై 29: ఆంధ్రప్రదేశ్ లో మొత్తం 30 మంది మహిళలు పోలీసు ఉద్యోగాలలో పనిచేస్తున్నారు. ఒక మహిళ పోలీస్ సబ్ఇన్స్పెక్టరుగా పనిచేస్తోందని ఇవాళ్ళ శాసనసభ ప్రశ్నోత్తరాల సమయంలో పోలీసు శాఖ మంత్రి చెప్పారు.

ఈ ముప్ఫయిమంది ఆడపోలీసులలోనూ, పదహారుగురు ప్రత్యేకపోలీసు శాఖలో పనిచేస్తున్నారు. వారంతా తమ ఉద్యోగ విధులను సమర్థవంతంగానూ, సంతృప్తికరంగానూ నిర్వర్తిస్తున్నారని కూడా మంత్రి వివరించారు.

ఇంకా ఎక్కువమంది మహిళలను పోలీసు ఉద్యోగాలలో నియమించే ప్రతిపాదనేదీ ప్రభుత్వంవద్ద ప్రస్తుతం లేదు.

కొన్ని సంవత్సరాల కిందట తెలంగాణాలో రాజకీయ చిక్కులు వచ్చినప్పుడు పోలీసులుగా మహిళలను నియమించడం జరిగిందని ఈ సందర్భంలో వచ్చిన ఇతరప్రశ్నలకు సమాధానంగా మంత్రి చెప్పారు. కేవలం ఆడపోలీసులు మాత్రమే పనిచేసే పోలీసుస్టేషన్లను ప్రత్యేకంగా ఏర్పాటుచేసే ఉద్దేశంకూడా లేదన్నారు.

### సంక్షేమశాఖలో కూడా

శిసు సంరక్షణ చట్టాన్ని అమలు జరిపేందుకు సాంఘిక సంక్షేమశాఖకు అనుబంధంగా ఆరుగురు ఆడ పోలీసు సబ్ఇన్స్పెక్టర్లూ, పదిమంది ఆడ పోలీసులూ ఉన్నారని సాంఘిక సంక్షేమ శాఖ మంత్రి చెప్పారు. వాళ్లల్లో కొంత మంది ఇంటర్మీడియేట్ పరీక్షలో కృతార్థులైనారు. మిగతా వాళ్ళు మెట్రిక్యులేషన్ పరీక్షలో నెగ్గిన అభ్యర్థులు.

### ఆబ్కారీ బకాయీల వసూలుకు సిబ్బంది

తెలంగాణా ప్రాంతంలోని ఆబ్కారీ కంట్రాక్టర్ల వద్దనుంచి ప్రభుత్వానికి రావలసిన బకాయీలను వసూలు చేసేందుకు ప్రత్యేక సిబ్బందిని ప్రభుత్వం నియమించింది. 1953-54 నుంచి 1955-56 దాకా ఈ పద్దున మొత్తం రు 1 కోటి 40 లక్షలు వసూలు కావలసి ఉన్నదని రెవిన్యూ మంత్రి చెప్పారు.

ఈ సంవత్సరంలోనే ఈ బకాయీ మొత్తాలన్నింటినీ వసూలు చేయించడానికి చేయగల ఏర్పాట్లన్నీ ప్రభుత్వం చేస్తోందని ఈ సందర్భంలో వచ్చిన ఇతర ప్రశ్నలకు మంత్రి సమాధానం చెప్పారు. త్వరగా బకాయీలను వసూలు చేయ్యడానికి అవసరమైన ఏర్పాట్లు చేయవలసిందిగా ఆయా జిల్లాల కలెక్టర్లను ప్రభుత్వం కోరింది.

## 'సామమార్గాన్ని విడిచి సమ్మెలకు దిగడం విద్రోహచర్య' అని నెహ్రూ హెచ్చరిక

### అభివృద్ధి కార్యక్రమాలతో సతమతం అవుతున్నప్పుడు ఇలాటి పనులు క్షేమకరంకావు

న్యూఢిల్లీ, జూలై 30: మన దేశానికి ఇంటా బయటా కూడా ప్రమాదాలు పొడచూపుతున్న ఈ సమయంలో ప్రభుత్వోద్యోగాలలో ఉన్న కొందరు సమ్మెచేస్తా వుంటున్నందుకు ఎంతో ఖేదం కలుగుతున్నది; ఇటువంటి చర్య అనాలోచితం, తొందరపాటు మాత్రమే కాదు, తరిచిచూస్తే, సమాజానికీ జాతికీకూడా అపాయకరం, అని ప్రధాని శ్రీ నెహ్రూ అన్నారు.

ప్రభుత్వోద్యోగులకు కష్టాలు ఉండవచ్చు; అవి ఇతరులకూ ఉన్నవే. వీటిని ప్రశాంత వాతావరణంలో ఆలోచించాలే కాని, అటు సమ్మెదారులు, ఇటు ప్రభుత్వంకూడా బలంచూపి బెదిరించడం తగదు, అనికూడా శ్రీ నెహ్రూ అన్నారు.

సమ్మెచేస్తారని బెదిరిస్తున్న ప్రభుత్వోద్యోగాలలోని వారిని, వారి సమస్యలు బెదిరింపులు, ఎదురుబెదిరింపుల వల్ల పరిష్కారమయ్యేవి కావని హెచ్చరిస్తూ, అటువంటిచర్యలు విరమించుకుని చర్చలద్వారా వారికష్టాలను తీర్చుకోడానికి ప్రయత్నించగలరని విశ్వసిస్తున్నాను, అని శ్రీ నెహ్రూ అన్నారు.

వృత్తిశిక్షణ జాతీయ మండలికి ప్రారంభోత్సవం జరుపుతూ శ్రీ నెహ్రూ పైవిధంగా అన్నారు.

దేశంలో విచ్ఛిన్నకరమైన తత్వం పెరుగుతున్న లక్షణాలకు శాముఎంతో కలవరపడుతున్నట్లు శ్రీ నెహ్రూ చెప్పారు.

వివాదాలను సామమార్గాలలో పరిష్కరించవచ్చునని ఆచరణపూర్వకముగా నిరూపించి భారతదేశం స్వాతంత్ర్యం సాధించింది. కాని, స్వాతంత్ర్యం అనంతరం భారతీయ మనస్తత్వంలోని ఆ ప్రాథమిక అంశాన్నే విస్మరించి భారతీయులు అపమార్గాలలో పడుతున్నారనిపిస్తున్నది.

భాషా సమస్య అవనీ, విద్యా విధానం గురించిన వివాదం అవనీ, అస్సాంలో నూనెపరిశుద్ధి కర్మాగారం స్థాపన విషయం అవనీ, దేనికిపడితే దానికి జనం బుర్రలు పగలకొట్టుకోడం ప్రారంభిస్తున్నారు.

ప్రశాంతంగా, నిష్పక్షపాతంగా ఆలోచించి పరిష్కరించవలసిన సమస్యలను యోచనలేకుండా కత్తులుకట్టి వ్యవహరించే పద్ధతి పెరిగిపోతోంది. ఇది చాలా ప్రమాదకరమైన లక్షణం, అని శ్రీ నెహ్రూ అన్నారు.

ఈ సమ్మె బెదిరింపులు దేశం అంతటికీ హానికలిగించగలవు. దేశం అంతా కూడా కష్టాలలో ఉన్నదే. మనకు పంచవర్ష ప్రణాళిక ఒకటుంది. ఇంకా అనేక సమస్యలున్నాయి.

కళ్లు తెరిచి చూసేవారికైతే, ఇంటా బయటా పొడచూపుతున్న ప్రమాదాలు కనపడతాయి. మనదేశస్థితి అతి చుల్కనగా, సమ్మెచేస్తాం అంటూ చీటికి మాటికి బెదిరించడం చూస్తే, ఎంతో ఖేదం కలుగుతున్నది. అంటే మనదేశం ఎదుర్కొంటున్న బ్రహ్మాండమైన బాధ్యతలు భరించే పరిణతి మనకు ఇంకా రాలేదని అర్థం.

మన బుద్ధి పరిపక్వం కాకపోతే, మనలో ఐక్యత లేకపోతే, ఏది ముందో ఏది వెనుకో తెలుసుకోలేని స్థితిలో మనం ఉంటే, మన ప్రణాళికలు, మన శిక్షణ, మన సాంకేతికాభివృద్ధి మొదలైనవన్నీ వ్యర్థం. సమష్టిగా కృషి జరిగినప్పుడే ఆ కృషి ఫలిస్తుంది. లేనిపక్షంలో పూర్వపు కక్షలు అంతఃకలహాల వ్యాధి దాపరించక తప్పదు.

మన ప్రణాళికలు, శిక్షణ, సాంకేతిక విజ్ఞానం ఫలించాలంటే కొన్ని షరతులున్నాయి. వాటిలో ఒకటి, మన అంతఃకలహాలను వివాదాలను సామమార్గాలలో పరిష్కరించుకోగలగడం.

కార్మికులకు కాదనలేని హక్కులలో సమ్మె ఒకటి అనేది ఒప్పుకుని తీరవలసిందే, అని శ్రీ నెహ్రూ అన్నారు. దాన్నిబట్టే కార్మిక సంఘాలూ, పరిశ్రమలూ కూడా అభివృద్ధి చెందాయి.

గడచిన నూరేళ్లలో కార్మికులను అతిదారుణంగా అణచివేసి, శిక్షించిన చరిత్ర అంతా ఎంతో బాధ కలిగిస్తుంది. కార్మికులు తమ హక్కులు కాపాడుకోడంలో సమ్మె అనేది తోడ్పడిందని మనకు తెలుసు.

హక్కు అనేది పేరుకి ఉండడం ఒకటి, సర్వకాలసర్వావస్థలలో దానిని అమలు జరుపుకోవాలనడం ఫలితాలు ఎలా పరిణమించినా ఆ హక్కు ఆచరణలో పెట్టుకోవాలనడం వేరువిషయం.

సాధారణ పరిస్థితుల్లో చెప్పవలసివస్తే, సమ్మెలనుకూడా నిష్పక్షపాతంగా ఉద్యోగరహితంగా పరిగణించవలసిందే. పరిశ్రమల విషయంలోనూ అంతే.

కాని కొన్నిరకాల ప్రభుత్వోద్యోగంలోనివారు, ప్రజావసరాలను నిత్యం తీర్చవలసినవారి విషయంలో సమ్మె అనేది కార్మికుల హక్కు మాత్రమే కాదు, అంతకంటే మించినది ఇతర పరిశ్రమలలో అయితే యజమానులు


(5 వ పుట చూడుడు)


### నెలకు 20 రోజులు ఆలస్యమే

న్యూఢిల్లీ, జూలై 29: రైళ్ళు ఆలస్యం కాకుండా సకాలంలో ప్రయాణంచేసేటట్లు, నిరంతర చర్యలు తీసుకుంటున్నామని రైల్వేశాఖ ఉపమంత్రి శ్రీ షానవాజ్ ఖాన్ లోక్ సభలో చెప్పారు.

శ్రీమతి పార్వతీకృష్ణన్: ఈ చర్యలకు అర్థం ఏమిటో చెప్తారా?

శ్రీ ఫిరోజ్ గాంధీ: గత 10 సంవత్సరాలనుంచి గ్రాండ్ట్రంక్ ఎక్స్ప్రెస్ ఆలస్యంగానే నడుస్తున్నా యిదే సమాధానం యిస్తున్నారు.

మరో కొత్త కారణం ఏదైనా సూచించవలసినదిగా రైల్వే మండలిని, మంత్రి అడగాలని కోరుతున్నాను. (నవ్వు)

శ్రీ జగజీవన్ రాం: పదేళ్ళనుంచి గ్రాండ్ట్రంక్ ఎక్స్ప్రెస్ ఆలస్యంగా నడుస్తున్నదని చెప్పకూడదు.

శ్రీ గాంధీ: 1947 నుంచి మీరు రైల్వేమంత్రిగా ఉండటంలేదు. నెల్లో 20 రోజులు యీ రైలు ఆలస్యమే.

### పటాస్కర్ నివేదిక రాలేదు

#### సంజీవరెడ్డి వివరణ

హైదరాబాదు, జూలై 30: ఆంధ్ర మదరాసు రాష్ట్రాల సరిహద్దు వివాదాలపై శ్రీ పటాస్కర్ నివేదిక గురించి, కేంద్ర ప్రభుత్వం వద్దనుంచిగానీ, శ్రీ పటాస్కర్ వద్దనుంచిగానీ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి ఇంతవరకూ వర్తమానమేమీ రాలేదు.

ఇవాళ్ళ శాసనసభలో ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి ఈ సంగతి చెప్పారు. చిత్తూరు జిల్లాలో తిరుత్తని తాలూకాను మదరాసు రాష్ట్రంలో కలపడానికి అనుకూలంగా శ్రీ పటాస్కర్ నిర్ణయించినట్టు ఇటీవల పత్రికా వార్తలపై సమాచారం తెలుసుకోనడానికి శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య రెండు విరామ తీర్మానాలను శాసన సభలో ప్రతిపాదించ సంకల్పించారు. ఆ విరామ తీర్మానాలకు సమాధానంగా ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి పైన వివరించిన సంగతి చెప్పారు.

శ్రీ పటాస్కర్ సిఫార్సులనుగురించి వెలువడిన వార్తలన్నీ కేవలం ఊహాగానాలుమాత్రమేనని ముఖ్యమంత్రి వివరించారు. విరామ తీర్మానాలను సభలో ప్రతిపాదించేందుకు శాసనసభ సభాపతి అనుమతి ఇవ్వలేదు. చెర్లపల్లికు గండ్లు, ఉద్యోగులలో అవినీతి వంటి సమస్యలపై వచ్చిన ఇతర విరామ తీర్మానాలకు కూడా సభాపతి అనుమతి నిరాకరించారు.

## పంచాయతీలకూ సహకార సంస్థలకూ దక్షత రాలేదు

### అభివృద్ధికి బాధ్యత లివ్వడంలో జాప్యం: మంత్రి ప్రకటన

['ఆంధ్రపత్రిక' ప్రతినిధి]

హైదరాబాదు, జూలై 29: జాతీయ విస్తరణ ప్రాంతాలలో పౌర అవసరాలకు సంబంధించిన పనులు నిర్వర్తించే బాధ్యతలను గ్రామపంచాయతీలకు, ఎరువులు, విత్తనాల, పంపిణీ బాధ్యతలను సహకార సంఘాలకు వప్పగించడానికి ప్రభుత్వం సిద్ధంగా వున్నదని, అయితే వాటికి ఇందుకు తగిన సామర్థ్యం వుండాలని ప్రణాళికా మంత్రి శ్రీ వల్లూరి బసవరాజు నేడు శాసనసభలో చెప్పారు.

అభివృద్ధి కేంద్రాల నిర్వహణ సంఘాల అధ్యక్షులుగా అనధికారులను నియమించే విషయం పరిశీలించగలమని చెప్పారు.

రాష్ట్ర శాసనసభ నేడు 1957-58 సంవత్సరానికి వివిధ పద్దులకు సంబంధించిన రు 6 కోట్ల 48 లక్షల 8 వేల మొత్తాన్ని మంజూరు చేయడంతో ఈ ఏడాది ఆయవ్యయపట్టిని ఆమోదించింది. శ్రీ కాశీశ్వరరావు అధ్యక్షత వహించారు.

అంతకుముందు ప్రణాళిక, అభివృద్ధి శాఖలమంత్రి శ్రీ వల్లూరి బసవరాజు ప్రతిపాదించిన రు 88629100 పద్దును (ప్రణాళికాశాఖ) ఆమోదించింది. వివిధ అంశాల క్రింద మరో రు 7 కోట్ల 20 వేల మొత్తాన్ని (స్టాంపులు, రిజిస్ట్రేషన్, పింఛన్లు, మొదలైనవి,) చర్చ లేకుండానే ఆమోదించింది.

ప్రణాళికా మంత్రి శ్రీ వి. బి. రాజు పద్దును ప్రతిపాదిస్తూ ఇలా అన్నారు.

### 282 వేల ఎకరాల అదనపు సాగు

"యీ పద్దుక్రింద రూ. 8 కోట్ల పైచిలుకు వ్యయంచేస్తున్నా రాష్ట్ర ప్రభుత్వ ఖజానానుంచి రు. 7545000 మాత్రమే ఖర్చుచేయాలి. రూ. 195 లక్షలు కేంద్రంనుంచి వస్తుంది. రు. 65 లక్షలు ప్రజాదానంగా వస్తుంది. పంచవర్ష ప్రణాళికలు అమలుజరిగాక ఆంధ్ర ప్రదేశ్ లో 282531 ఎకరాలు సాగులోకి వచ్చినవి. పశుగణాభివృద్ధి కేంద్రాలు 3265 ఏర్పడినవి. ప్రాథమిక ఆరోగ్యాభివృద్ధి కేంద్రాలు 39 మాతాశిశు సంరక్షణ కేంద్రాలు 188 మంచినీటి బావులు 4888 క్రొత్త పాఠశాలలు 11807 వెలసినవి. 1715 మైళ్ల మంచి రస్తాలు 3700 ఒక మాదిరి రస్తాలు 491 పారిశ్రామిక శిక్షణ కేంద్రాలు 2581 సహకారసంఘాలు 2171 పంచాయతీలు ఏర్పడినవి. మొన్న ఏప్రిల్ నాటికి 10879 గ్రామాలలో 35152 చ|| మైళ్లలో 11086962 జనాభాకు ఇది లాభిస్తుంది. రాష్ట్రంలో 84 జాతీయ విస్తరణ కేంద్రాలు 40 సమాజాభివృద్ధికేంద్రాలు 4 సకలార్థ సాధక కేంద్రాలు 22 ఇతర అభివృద్ధి ప్రాజెక్టులు, మొత్తం 150 పని చేస్తున్నవి. ఇప్పుడు రాష్ట్రంలో మూడవవంతు జనాభాకు ఇది లాభిస్తున్నది."

### నిపుణుల సంఖ్య పెరగడం ముఖ్యం

"ద్వితీయ పంచవర్ష ప్రణాళిక చివరకు మొత్తం రు 46 కోట్లు 50 లక్షలు వెచ్చిస్తారు. ఇందుకు వేలాది గ్రామ సేవకులు 4 వేల సాంకేతిక ప్రవీణులు అవసరం. 100 ఎకరాల అదనపు సాగుకన్న 100 మంది సాంకేతిక ప్రవీణులు తయారయితే హెచ్చు ప్రయోజనమని నా అభిప్రాయం. ద్వితీయ ప్రణాళికలో పరిశ్రమలకు హెచ్చు ప్రాధాన్యం ఇస్తున్నాం. స్థానిక అభివృద్ధి పనులక్రింద రు 84 లక్షలు భారత ప్రభుత్వం రాష్ట్రానికి ఇచ్చింది. ఇంకా ఇస్తారని ఆశిస్తున్నాము. ఇప్పుడు వెలసిన సంస్థల నిర్వహణకు సాలుకు రు 3 కోట్లు అవసరం. ఈ సంస్థల నిర్వహణకు అవసరమయిన డబ్బు ప్రభుత్వం ఇవ్వలేదు గనుక పంచాయతీలు ప్రజలు సంపాదించే మార్గం చూడాలి. వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధికూడా ఆలోచిస్తాం. సిబ్బందిపై హెచ్చు ఖర్చు జరగడంలేదు. పొదుపు మార్గాలు గురించి జిల్లా ప్రణాళికా సంఘాలను అడుగలేము. ఇప్పుడు వెలసిన సంస్థలన్నీ ప్రజాసహకారంతో దిగ్విజయంగా నిర్వహించడానికి ప్రణాళిక జయప్రదంగా జరపడానికి ప్రజలలో నిస్పృహా, నిరాశలకు తావులేకుండా సాంఘిక సంక్షేమ రాజ్యం స్థాపించడానికి ప్రజల, ప్రజాప్రతినిధుల సహకారం అత్యంత అవసరం."

మంత్రి ప్రతిపాదించిన రు. 886 లక్షల పద్దుకు పది కోత తీర్మానాలు వచ్చాయి. వీటిపై శ్రీ వి. విశ్వేశ్వరరావు చర్చప్రారంభిస్తూ అభివృద్ధి పనులకు కేటాయించిన మొత్తాలలో చాలా పెద్దభాగం సిబ్బంది జీతాలకే ఖర్చిస్తున్నారని విమర్శించారు.

పనుల కోసం మిగిలేది చివరకు మూడవవంతు మాత్రమేనన్నారు. అందరికీ భూమిలిస్తే వారంతా ఉత్సాహంగా పాల్గొంటారనీ, అప్పుడే జీతాల ఖర్చు అంతగా ఉండదనీ చెప్పారు. చేదబావుల్ని విరివిగా సాగుతున్నాయని, దట్టాలు నిరుపయోగమవుతున్నాయని తెలిపారు. గ్రామసేవకులు హరిజనవాడల గోడు పట్టించుకోవడం లేదన్నారు.

శ్రీ వి. కోదండరామరెడ్డి అభివృద్ధి కేంద్రాల నిర్వహణ పొదుపుగా జరగాలని, జిల్లా అభివృద్ధి సంఘాల, జాతీయ విస్తరణ సేవాసంఘాల మధ్య సమన్వయం కుదరాలని సూచించారు. ప్రచారంకోసం డబ్బు పాడుచేయరాదని శ్రీ కె. రాజమల్లు సలహా ఇచ్చారు. వ్యవసాయాభివృద్ధికి ఎక్కువ ప్రాముఖ్య మివ్వాలని శ్రీ సి.వి. నరసింహారావు కోరారు.

అభివృద్ధి పనుల నిర్వహణ బాధ్యతలను అనధికార సంస్థలకు ఇవ్వాలని శ్రీ చెంచు రామానాయుడు సూచించారు. ప్రయోగాత్మకంగా కొద్దిచోట్ల అమలు జరపాలన్నారు. ఆయా ప్రాంతాల అవసరాలేమిటో పూర్తి వివరాలు సేకరించాలని శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య సూచించారు. సమాజాభివృద్ధిజాతీయవిస్తరణకేంద్రాలలో జరిగిన కృషి పరిశీలనకు ఒక సంఘం నియమించాలని కోరారు. వెనుకటి జమీందారీ ప్రాంతాలలో ఋణాల మంజూరుకు నిబంధనలు సడలించాలని శ్రీ లక్కు లక్ష్మణదాసు కోరారు. శ్రీ బి.


(6 వ పుట చూడుడు)


## గ్రామోద్యోగులే బెదిరిస్తున్నారు

### ప్రభుత్వపు పరిస్థితి 'విభూతి లేని సానుభూతి'

['ఆంధ్రపత్రిక' ప్రతినిధి]

హైదరాబాదు, జూలై 30: "గ్రామోద్యోగులను ప్రభుత్వం బెదిరించడంలేదు; వారే ప్రభుత్వాన్ని బెదరిస్తున్నారు. వారి కష్టాలంటే ప్రభుత్వానికి సానుభూతి ఉన్నది. కాని, విభూతిలేని సానుభూతి నిరుపయోగం" అని ఇవాళ శాసనసభలో (అప్రోప్రియేషన్) నగదు మంజూరు బిల్లుపై జరిగిన చర్చకు సమాధానంలో ఆర్థికమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డి అన్నారు.

బిల్లును సభ మూడవసారి పరిశీలిస్తూండగా ప్రతిపక్షం కోరికపై జరిగిన వోటింగులో బిల్లుకు అనుకూలంగా 110 వోట్లూ, వ్యతిరేకంగా 42 వోట్లూ వచ్చినవి.

### మంత్రాలు లేవు

శ్రీ గోపాలరెడ్డి ఇట్లా చెప్పారు "మంత్రులవద్ద మంత్రాలేమీ లేవు. ప్రభుత్వ యంత్రాంగాన్ని తిప్పడానికి ప్రజల అవసరాలను సమకూర్చడానికి డబ్బు కావాలి. ప్రజల అవసరాలను సమకూర్చలేని స్థితిలో కూర్చునే బదులు పన్నులు విధించి అయినాసరే డబ్బు తీసుకువచ్చి ప్రజల అవసరాలను సమకూర్చడం సమంజసం."

"బడ్జెట్ పై ఇరవై రోజులు చర్చ జరిగింది కదా ఇవాళైనా సభ్యులు సూచనలేమైనా చేస్తారేమోనని అనుకున్నాను. ఇరవైరోజులూ చెప్పకుండా దాచుకున్న సూచనలను ఇవాళైనా బయటపెడ్తారని అనుకొన్నాను. కానీ, ఇవాళకూడా అప్రోప్రియేషన్ బిల్లును ఆమోదించడం లేదని శ్రీ సుందరయ్య అన్నారు. వారు చెప్పే మాటవరక నెగ్గితే ప్రభుత్వం రాజీనామా ఇవ్వవలసి వస్తుంది. శ్రీ సుందరయ్య అభిప్రాయం అదికాదనుకుంటాను. మేముచేసే పనులలో మీకు నమ్మకం లేకపోతే అవిశ్వాస తీర్మానాన్ని ప్రతిపాదించండి."

### చెప్పడం సులభమే

"పనులు సక్రమంగా జరగడంలేదని అంటున్నారు. దుబారా జరుగుతోందని ఆవేదనగా చెబుతున్నారు. చాలా సంతోషం. సలహా చెప్పడం సులభమే. మరి ప్రభుత్వాన్ని నడిపించడం అంత సులభం కాదు...మీరు కొంత సానుభూతి చూపించాలి.

"ప్రధాన కార్యదర్శి దగ్గరనుంచి గ్రామోద్యోగుల దాకా ఉద్యోగులందరినీ నడిపించాలంటే ఎంత ఆయాసం కావాలో ఆలోచించండి. ప్రభుత్వ యంత్రాన్ని నడిపించడం అంత సులభమైన పని కాదు. మనం ధర్మకర్తలమనన్న సంగతి గుర్తుంచుకొని, ఎక్కడ ఎక్కువ ఖర్చు చేస్తారోనని ఎక్కడికక్కడ అకౌంటెంట్ జనరల్ చూస్తూంటాడన్న సంగతిని కూడా జ్ఞాపకం ఉంచుకుంటే ఆలస్యానికి కారణం బాగా అర్థమవుతుంది."

"పనులు జరగడంలేదని అంటున్నారు. ధనాభావంవల్లనే జరగడంలేదు. కొన్ని శతాబ్దాలపాటు జరగని పనులన్నీ రెండు సంవత్సరాల్లో-అయిదేళ్ళలో-పదిసంవత్సరాలలో జరగాలని ప్రజలు ఆతృతపడడం సహజమే. మీరు పైకొన్ని పక్షంవలసి ఉంటే మనం మాను నాల్గు


(5 వ పుట చూడుడు)


## ప్రజాప్రతినిధులు మాత్రం సహకరించలేదు

### సామాజికాభివృద్ధి కార్యక్రమాల నిర్వహణ

న్యూఢిల్లీ, జూలై 29: క్రిందటి అయిదు సంవత్సరాలలో దేశంలో సామాజికాభివృద్ధి కార్యక్రమాలు నిర్వహించడంలో కొన్ని విజయాలు సాధించినట్లు, కొన్ని ఓటములు సంభవించినట్లు కేంద్రప్రభుత్వ సమాజాభివృద్ధి శాఖమంత్రి శ్రీ ఎస్. కె. డే నేడు లోక్ సభలో వివరించారు.

నిర్మాణ కార్యక్రమాల నిర్వహణకు ఏర్పరచిన లక్ష్యాలు సాధించడంలోను, గ్రామీణుల జీవితపరిస్థితులు అభివృద్ధి పరచే ప్రయత్నంలో తన అధికారం క్రింద ఉన్నశాఖ కృషిని ఇతర ప్రభుత్వశాఖల కృషిని సమన్వయపరచడం లోను విజయాలు సాధించడం జరిగినదని శ్రీ డే చెప్పారు. కాని సామాజికాభివృద్ధి కార్యక్రమాల నిర్వహణంలో పార్లమెంటు సభ్యులు, రాష్ట్ర శాసనసభల సభ్యులు మున్నగు ప్రజాప్రతినిధుల సహకారం సంపాదించడానికి చేసిన కృషిమాత్రం విఫలమైనదని ఆయన సూచించారు.

సమాజాభివృద్ధి శాఖకు మొత్తం 8,27,00,000 రూపాయలు మంజూరు చేయమని కోరుతూ ప్రవేశపెట్టిన పద్దులపై లోక్ సభలో జరిగిన చర్చకు సమాధానం ఇస్తూ శ్రీ డే పైవిధంగా చెప్పారు. ఆ పద్దులను లోక్ సభ ఆమోదించినది.

### సలహా సంఘాలు

అభివృద్ధి కేంద్రాల సలహాసంఘాలు ప్రజలకు ఎక్కువగా ప్రాతినిధ్యం వహించేటట్లు చేయడానికి మరింత సమర్థంగా పనిచేసేటట్లు చూడడానికి వాటి పునర్నిర్మాణానికి ఉత్తర్వులు జారీచేసినట్లు శ్రీ డే వెల్లడి చేశారు. గ్రామీణుల పరిస్థితులు అభివృద్ధిపరచడానికి పథకాలు తయారుచేయడంలో సలహాసంఘాలు చేసే సూచనలను ప్రభుత్వం ఇకముందు అధికారికంగా పరిగణిస్తుందని కూడా ఆయన చెప్పారు.

సామాజికాభివృద్ధి కార్యక్రమాలు గురించి తెలుసుకోవడానికి, పరిశోధనకు, శిక్షణకు ప్రభుత్వం ఢిల్లీలో ఒక కేంద్ర శిక్షణాలయం నెలకొల్ప గోరుతున్నదని శ్రీ డే ప్రకటించారు.

సమాజాభివృద్ధి కార్యక్రమాల నిర్వహణకు హృదయపూర్వకంగా తోడ్పడి సహకరించవలసినదని పార్లమెంటు సభ్యులకు, రాష్ట్ర శాసనసభల సభ్యులకు శ్రీ డే విజ్ఞప్తి చేశారు. ప్రజాప్రతినిధులు సహకరించక పోతే సమాజాభివృద్ధికి అర్థం లేకుండా పోతుందని ఆయన హెచ్చరించారు.

### చర్చ వివరాలు

అంతకుముందు ఆ పద్దులపై కొనసాగిన చర్చలో పాల్గొంటూ, కార్యక్రమాల నిర్వహణకు ప్రజా సహకారం లభ్య మయ్యేటట్లు చూడడానికి ప్రముఖ ప్రజానాయకుల అధ్వర్యం క్రింద కార్యక్రమ నిర్వహణ సంఘాలు ఏర్పరచాలని శ్రీ అన్సార్ హర్వానీ (కాం-ఉత్తరప్రదేశ్) సూచించారు. అభివృద్ధి కార్యక్రమాలు సఫలం కావాలంటే ప్రజలే ప్రభుత్వ సహకారంతో వాటిని రూపొందించాలి కాని ప్రజలపై వాటిని రుద్దరాదని శ్రీ ఎస్. ఎన్. దాస్ (కాం


(4 వ పుట చూడుడు)


### గ్రామోద్యోగుల వైఖరి మారాలి

#### ఆంధ్ర కాంగ్రెసు అధ్యక్షుని విజ్ఞప్తి

(ఆంధ్ర పత్రిక ప్రతినిధి)

హైదరాబాదు, జూలై 30: "గ్రామోద్యోగుల కోరికలను పరిశీలించేందుకు ప్రభుత్వం ఒక సంఘాన్ని నియమించింది. కనుక సహాయ నిరాకరణ వైఖరిని గ్రామాధికారులు మార్చుకొని విచారణ సంఘంవల్ల పూర్తి ప్రయోజనం పొందాలి" అని ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు విజ్ఞప్తి చేస్తున్నారు. ప్రకటనలో ఇట్లా ఉన్నది: "ఆంధ్రరాష్ట్ర గ్రామాధికారుల సంఘం కార్యకలాపాలను కొన్నాళ్లుగా శ్రద్ధగా పరిశీలిస్తున్నాము. ప్రభుత్వంపై ఒత్తిడి తీసుకు రావటానికి వారు చేయవలసిన పనులను చేయడానికి నిరాకరించడం వారికి చాలా బాధ కలిగించింది. గ్రామాధికారుల ఇబ్బందులు నాకు బాగా తెలుసు; స్థితిగతులను బాగు చేసుకోడానికి, వారు చేసే కృషిపట్ల నాకు పూర్తిగా సానుభూతి ఉన్నది. గ్రామోద్యోగుల సమస్యల విచారణకు ప్రభుత్వం ఒక సంఘాన్ని నియమించింది కనుక ఇక ఇప్పుడు గ్రామాధికారులు సహాయ నిరాకరణ వైఖరిని మార్చుకొని విచారణ సంఘంవల్ల పూర్తి ప్రయోజనాన్ని పొందడం సమంజసం. కనుక ఈ పరిస్థితిని పునః పరిశీలించి, ఉద్యమాన్ని వెంటనే విరమించి, చేయవలసిన పనులను సక్రమంగా నిర్వర్తించి, విచారణ సంఘంవల్ల పూర్తి ప్రయోజనం పొందవలసినదిగా ఆంధ్ర రాష్ట్ర గ్రామోద్యోగుల సంఘానికి విజ్ఞప్తి చేస్తున్నాను. గ్రామాధికారులంటే ప్రభుత్వానికి కూడా సానుభూతి ఉన్నది. కనుక గ్రామాధికారులు తమ వైఖరిని మార్చుకుంటే ప్రభుత్వంకూడా అంగీకరించి తగినట్లు సానుభూతితో వ్యవహరిస్తుందని నా నమ్మకం."

# ముసలివాళ్లకు పడుచుతనాన్ని ఇచ్చే మందు "నవోచయన్"

## రుమేనియా వైద్యుడు అస్లాన్ కొత్త వైద్యం: పాత మందుల్లో కొత్త శక్తి

మిలానో (ఇటలీ) జూలై 28: పళ్లవైద్యులు ఇంతవరకు నొప్పి తెలియకుండా చెయ్యడానికి వాడుతున్న స్థానిక ఔషధి "నవోచయన్" లో వృద్ధులకు నవజీవాన్ని ఇచ్చి, యౌవన శక్తిని కల్పించే శక్తివున్నట్లు ప్రయోగంవల్ల, ఇప్పుడు తేలింది.

రుమేనియాలో బుఖరెస్టులో ఈ "నవోచయన్"ను ఆట్లా వాడి వేలకొలది వృద్ధులకు కాయకల్పాన్ని చేకూర్చినట్లు ఇక్కడ సమావేశంఅవుతున్న 38 దేశాల డాక్టర్లకు, బుఖరెస్టు వైద్యులు తెలియచేశారు.

### డా॥ అస్లాన్ వైద్యం

సమావేశంలో ఇన్ని దేశాలనుంచి 800 డాక్టర్లు వచ్చారు. వృద్ధాప్యం రహస్యాన్నిగూర్చి వీరు చర్చిస్తున్నారు. ఈ చర్చల్లో బుఖరెస్టు నుంచి వచ్చిన డాక్టరు ప్రొఫెసర్ ఎ. అస్లాన్ ఈలా చెప్పారు: దాదాపు 4900 మంది వృద్ధులకు ఈ మందువాడి పరీక్ష చేశాము. "నవోచయన్"ను కండరాలకు సూదుల ద్వారా ఎక్కించగా, ఈ వృద్ధులు, శరీర తత్వదృష్ట్యా యౌవనాన్ని వహించిన వాళ్లయినారు. ఈ ఓషధినిగూర్చిపరిశోధనలు జరపగా, దీనితో యౌవనజీవితాన్ని పొడిగించడం సాధ్యం అని తేలింది."

అనంతరం ప్రొఫెసర్ అస్లాన్, ఈ మందువల్ల మనుష్యుల నరాలలోను, అంతరంగిక జీవద్రావక కోశాల్లోను, త్వక్కులోను, నఖములు, శిరోజాలు, ఎముకలు, కీళ్ళు, గుండె, రక్తం వీటి అన్నింటిలోను వచ్చేమార్పులను గూర్చి వివరించారు.

# జర్మనీ ఏకీకరణకు తూ.జర్మనీ సూచనలు

## డా॥ అడనోవర్ తిరస్కృతి

మ్యూన్‌స్టర్, జూలై 28: జర్మనీ ఏకీకరణను పురస్కరించుకొని, తూర్పు జర్మనీ చేసిన సూచనలను, పశ్చిమజర్మనీ ప్రధానమంత్రి డా॥ అడనోవర్ నేడు తిరస్కరించారు.

తూర్పు జర్మనీవారు సూచిస్తున్న "కాన్ఫెడరేషన్ పద్ధతి" ఆలోచించవలసింది గూడా కాదని డా॥ అడనోవర్ భావిస్తున్నారు.

ఇక్కడ రోమన్ కేథలిక్కు ఉపాసకుల సభలో మాట్లాడుతూ, డా॥ అడనోవర్ ఈలా అన్నారు: "సోవియట్ ఆక్రమణ ప్రాంతంలో వున్న 170 లక్షల ప్రజలను బానిసత్వంలో ముంచివేసే, ఈ పద్ధతిని, మేము ఎన్నడూ అంగీకరించము."

# సురావర్ది ప్రకటనలపై వివిధ దేశాల అభ్యంతరం

కరాచీ, జూలై 28: అమెరికాలో పాక్ ప్రధాని శ్రీ సురావర్ది చేసిన ప్రకటనలపై భారత, రష్యా, చైనా, ఆఫ్ఘనిస్తాన్ మొదలైన దేశాలు నిరసన తెలిపాయని కొన్ని పాకిస్తాన్ పత్రికలు ప్రచురించాయి.

ఈ సమాచారం విశ్వసనీయ వర్గాల ద్వారా తెలిసిందని బహుజనప్రచారం గల 'జంగ్' అనే దినపత్రిక పేర్కొని అలవాటు ప్రకారం ఈ నిరసనలను ప్రభుత్వం ఖాతరుచేయదని వ్రాసింది. ఈ వార్తపై అధికారులు ఇంకా ఏమీ వ్యాఖ్యానం చేయలేదు.

కాలువనీటి తగాదా విషయమై సురావర్ది ప్రసంగానికి భారతదేశం అభ్యంతరం తెలిపింది. ఈ విషయమై సంప్రదింపులు జరిగే సమయంలో, ఏ దేశమూ దీనిని గురించి ప్రచారం చేయరాదని భారత పాకిస్తానులు ప్రపంచ బ్యాంకుతో ఒప్పందం చేసికొన్నాయి. పాకిస్తాన్ ప్రధాని అసత్య ప్రచారం చేస్తున్నారని భారత ప్రభుత్వం తెలిపింది. ఫక్తూనిస్తాన్ విషయమై ఆఫ్ఘనిస్తాన్ నిరసన తెలియజేసింది.

ఇండొనేషియా, సిరియాలుకూడా ఈయన ఉపన్యాసాలకు నిరసన తెలిపాయి. ఈ రెండుదేశాల ప్రతిపత్తికి భంగం కలిగించేరీతిని ఈయన అమెరికాలో మాట్లాడినందుకు ఈ ప్రభుత్వాలు అభ్యంతరం తెలిపాయి.

## సురావర్ది రాజీనామా ఈయాలి

అమెరికాలో పర్యటనలో సురావర్ది కుటిలరాజనీతి పూర్తిగా బయటపడిందనీ, ప్రధానమంత్రిపదవిని వహించడంలో ఈయన దేశప్రజలలో కట్టకడపటివాడనీ, ఈయన తక్షణమే రాజీనామా ఈయాలనీ మాజీ ముస్లింలీగ్ కేంద్రమంత్రి శ్రీ ఫజ్లూర్ రహమాన్ అన్నారు. ఈయన జాతీయ శాసన సభలో సభ్యుడు కూడా.

అమెరికాలో సురావర్ది అసభ్యంగాను, నిర్లక్ష్యంగాను ప్రసంగాలు చేశారనీ, పాకిస్తాన్ న్యాయమైన కోర్కెలను సైతం మన్నించవలసిన పనిలేదని ఐసెన్‌హోవర్, ఆయన ఉద్యోగులు అభిప్రాయపడ్డారనీ, కాశ్మీరు, కాలువనీటి తగాదాలపై పాకిస్తానుకు తోడ్పడతామని అమెరికా వాగ్దానమైనా ఈయన పొందలేకపోయారనీ అన్నారు. అమెరికా, బ్రిటన్లను స్తుతిస్తూ, పాశ్చాత్య రాజ్యాల ప్రతినిధిగా చేసిన ఆర్భాటంతో ఆ రాజ్యాలతో పాకిస్తాన్ సమ ఉజ్జీ కాదనీ, అమెరికా ఉపగ్రహరాజ్యమేననీ అందరికీ స్పష్టమైందనీ, ఇందువల్ల పాకిస్తానుకు తీరని అపచారం కలిగిందనీ అన్నారు. పాశ్చాత్య రాజ్యాలతో సన్నిహిత సంబంధమైనా ఉండవచ్చుగాని అనవసరంగా ప్రతిచోటా సురావర్దిమాదిరిగా కమ్యూనిజంను దుయ్యబట్టవలసినపనిలేదన్నారు.

ఈయన ఉపన్యాసాన్ని అత్యధిక కరాచీపత్రికలు మొదటిపుటలో ప్రముఖంగా ప్రచురించాయి.

## అవామీలీగ్ తాత్కాలిక అధ్యక్షుని ఎన్నిక

ఢక్కా, జూలై 18: తూర్పు పాకిస్తాన్ అవామీలీగ్ అధ్యక్ష పదవికి మౌలానాభాషానీ రాజీనామా ఇచ్చినందువల్ల తాత్కాలికాధ్యక్షునిగా మౌలానా అబ్దుల్ రషీద్ తర్కబాగిష్‌ను అవామీలీగ్ కార్యవర్గం ఎన్నుకొంది. ఈయన ఇంతవరకూ ఉపాధ్యక్షుడుగా ఉన్నారు. పార్టీ కార్యదర్శిగాఉన్న రహమాన్ ఆగస్టు 7వ తేదీన మంత్రివర్గంనుండి తప్పుకుంటారు.

## కొత్తపక్షంలో 45 గురు శాసన సభ్యుల చేరిక

నూతనంగా నెలకొల్పిన జాతీయ అవామీలీగ్ పార్టీలో 45 మంది రాష్ట్ర శాసనసభ్యులు చేరారనీ, ఇంకా మరి కొంతమంది చేరతారనీ పార్టీ ప్రతినిధి ఒకరు తెలిపారు. ఏకుసురు సభ్యులు గల శ్రీ లాహిరీవర్గం ఒకటి, రెండు రోజులలో ఈ పక్షంలో చేరవచ్చు.

ఈ పార్టీ కేంద్ర వ్యవస్థా పరిశీలక సంఘం నేడు మొదటిసారిగా సమావేశమైంది. ఈ సంఘ కార్యవర్గాన్ని ఎన్నుకొనే తేదీని వాయిదా వేశారు. శ్రీ ఇక్తికరుద్దీన్, గఫార్ ఖాన్, బెలూచిస్తాన్ గాంధి ప్రభృతులు ఈ సమావేశంలో పాల్గొన్నారు.

పుష్తూభాష మాట్లాడే ప్రాంతాన్ని అంతటినీ కలిపి పుష్తూనిస్తాన్‌గా ఏర్పాటుచేయాలని బెలూచిస్తాన్‌గాంధి ఖాన్ అబ్దుస్ సమద్ ఖాన్ అన్నారు.

# సింహళంలో తమిళం, రాజీకి ఒప్పుకోలు

బట్టికాలో (సింహళం), జూలై 28: సింహళంలో తమిళభాషా వినియోగం గురించి, ఫెడరల్ పార్టీ నాయకులు ప్రధాని శ్రీ బండారనాయకేతో చేసుకున్న "తాత్కాలిక ఒప్పందానికి" ఆగస్టులో తలపెట్టిన చట్ట నిరాకరణోద్యమం అభిప్రాయం విరమించుకోడానికీ, ఇవాళ ఫెడరల్ పార్టీ వార్షిక సమావేశం ఆమోదం తెలిపింది.

అయితే, సింహళంలో తమిళ భాషా రాష్ట్రం లేదా రాష్ట్రస్థాపనే తమ లక్ష్యమని తిరిగి పార్టీ ప్రకటించింది. రెండేళ్లయి కక్షలవల్ల విడిపోయిన భారతీయ సంస్థల నాయకులు ఇవాళ్లకు ఈ సమావేశంలో కలుసుకున్నారు.

తమిళ ఉద్యమానికి సింహళ పార్లమెంటులో ఏకైక ప్రతినిధిఅయిన శ్రీ సుందరలింగం ఈ తాత్కాలిక ఒప్పందంపట్ల నిరసనగా ప్రక్కనే వేరొక సభ జరపడానికి ప్రయత్నించారు. కొందరు ఈసభపై రాళ్లురువ్వడం అల్లరి చెయ్యడం మొదలుపెట్టడంతో పోలీసులు వచ్చి శ్రీ సుందరలింగంను బలవంతాన తీసుకుపోవలసివచ్చింది.

# కొరియాలో యుద్ధ విరమణకు భంగం

## సమితి అధికార్లపై ఉత్తర కొరియా ఆరోపణ

కొరియా, జూలై 28: పాన్ మున్ జాన్ యుద్ధవిరమణ ఒప్పందాన్ని సమితి సైనికాధికార వర్గం తిరస్కరించిందన్న ఉత్తర కొరియా అధిక్షేపణను ఆ అధికారవర్గం వారు నేడు తిరస్కరించారు.

కొరియా యుద్ధవిరమణ సంఘం సభలో ఉత్తరకొరియా ప్రతినిధి మేజర్ జనరల్ ఛుంగ్ కూక్ రోక్ సమితి సైనికాధికార వర్గం మూడు విధాలు, ఈ యుద్ధవిరమణ ఏర్పాట్లనుభంగపరిచిందని ఆరోపించారు.

(1) యుద్ధ విరమణ ఒప్పందంలో అధికరణం 13డి ని సమితి అధికార వర్గం రద్దుచేసింది. ఈ అధికరణంలో కొత్త ఆయుధాలను కొరియా దింపరాదని, ఇరు వర్గాలు అంగీకరించాయి.

(2) దక్షిణ కొరియాలో వున్న అమెరికా 7వ పటాలానికి కొత్త ఆయుధాలను ఇచ్చి అణుయుద్ధానికి వారిని సన్నద్ధం చేయడం జరుగుతోంది.

(3) ఆయుధసామగ్రిని గూర్చిన నివేదికలను తటస్థదేశాల పర్యవేక్షణ సంఘానికి సమర్పించవలసిన ఏర్పాట్లను గూడా సమితి అధికారవర్గం రద్దు చేసింది.

# అల్జీరియాలో తిరిగి దేశభక్తుల విజృంభణ

ఆల్జీర్స్, జూలై 29: ఆల్జీరియాలోవున్న ట్యునిస్, తిరిగి దేశభక్తులు విజృంభించారు. అల్జీర్సుకు 90 కిలో మీటర్ల దూరంలో జామా లేపు పర్వతంగా కొండలో ఫ్రెంచి పదాతి బలాన్ని ఒకదాన్ని ఎదుర్కొని, అందులో 15 మందిని చంపివేశారు.

ఓరాన్ ప్రాంతంలో ఫ్రెంచివారు 24 మంది దేశభక్తుల్ని చంపారు.

విజయవాడ రామమోహన గ్రంథాలయంలో రంగాగారికి పశ్చిమ కృష్ణాజిల్లా "రంగా విగ్రహ ప్రతిష్ఠాపన సంఘ" అధ్యక్షుడు శ్రీ కాకాని వెంకటరత్నం 25 వేల రూపాయిలు, సన్మానపత్రం సమర్పించారు.

గతవారం హైదరాబాదులో జరిగిన ఆంధ్ర గ్రామీణ వైద్యుల మహాసభలో శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు, డా॥ యం. వి. కృష్ణారావు, డా॥ అచ్చమాంబ.

# ఇమాం సైన్యంచే ముట్టడి

## కైరోలోని ప్రతినిధి ప్రకటన

కైరో, జూలై 28: ఒమన్‌లోని బ్రిటిష్ సైన్యాన్ని, కార్మికులను ఇమాం సైన్యాలు చుట్టు ముట్టాయని ఇక్కడి ఇమాం ప్రతినిధి మహమ్మద్ ఎల్ హారిథీ తెలిపారు.

బ్రిటన్ దాడులు చేసినా తమ ముఖ్య స్థావరాలు తమ అధీనంలో ఉన్నాయనీ, సైనిక సహాయం చేయమని ఇమాం ఏ దేశాన్నీ కోరలేదనీ, చైనా సూచనను ఆయన పరిశీలిస్తున్నారనీ చెప్పారు. వైద్యసహాయం మాత్రం కోరారనీ, అదైనా అవధికార విజ్ఞప్తి అనీ, సౌదీ అరేబియానుండి ఇమాంకు ధన, వైద్య సహాయాలు లభ్యం ఔతున్నాయనీ కూడా ఆయన తెలిపారు.

ఈ ప్రాంతంలోని బ్రిటిష్‌ప్రజలు కాళీ చేశారన్నారు. తమ సైన్యాలకు ఆయుధాలు మస్కాట్ నుండే లభ్యమయ్యాయనీ, ఈ విప్లవానికి ముందు బ్రిటిష్ ఆయుధాలను ఒమాన్ వర్తకులు తెచ్చారనీ, బ్రిటిష్‌వారితో జరుపుతున్న పోరాటం వారి ఆయుధాలతోనే కూడా ఆయన అన్నారు.

కైరోలోని తమ కేంద్రంనుండి సౌదీఅరేబియా ద్వారా ఒమాన్‌తో సంప్రదింపులు జరుగుతున్నాయన్నారు. ఇమాం ఇప్పుడు కూడా రాజధానియైన నిజ్వాలోనే ఉన్నారనీ, ముఖ్యనగరాలు ప్రాంతం ఒమాన్ సైనికుల అధీనంలో ఉందనీ ఈయన తెలిపారు. ఒమాన్ సంఘటనల విషయమై సమితిలో ప్రస్తావించే విషయాన్ని అరబ్ మండలి నిశ్చయించుకోవాలన్నారు. ఒక్క అరబ్ రాజ్యాలనుండే మాత్రమే సహాయం తీసికోవాలని ఇమాం భావిస్తున్నారని కూడా ఈయన చెప్పారు.

## బ్రిటన్‌చే వార్తల నిషేధం

బహ్రైన్, జూలై 28: మస్కాట్‌పై తాము జరిపిన దాడులకు సంబంధించిన వార్తలను తాత్కాలికంగా బయటికి తెలియనీయరాదని బ్రిటిష్ సైనిక దళం ఉత్తర్వు చేసింది. ఐతే తిరిగి దాడులు ఏమీ జరగలేదని ఈ దళం ప్రతినిధి అన్నారు.

ఇమాం విప్లవోద్యమం పూర్తిగా భగ్నమైపోయిందని బహ్రైన్‌లోని బ్రిటిష్ ప్రతినిధి బెర్నార్డ్ అన్నారు.

## ఒమాన్‌కు లొంగిపోలేదు

ఇక్కడవద్ద ఇమాం సైన్యాలు ఒమాన్ సుల్తానుకు లొంగిపోయాయని వెలువడిన వార్తలలో ఎంతమాత్రం నిజం లేదనీ, ఈ విషయమై ఇప్పుడే వార్త అందిందనీ, ప్రతిచోటా బ్రిటిష్‌సైన్యాలతో ఇమాం సైన్యాలు పోరాడుతున్నాయనీ కైరోలోని ఇమాం ప్రతినిధి హారిథీ అన్నారు.

# మాస్కోలో ప్రపంచ యువజనోత్సవం

## 90 దేశాలనుంచి 30 వేలమంది హాజరు

మాస్కో, జూలై 28: శాంతి స్నేహాలకు ప్రపంచ యువజనోత్సవం ఇవాళ మాస్కో, లెనిన్ స్టేడియంలో ప్రారంభమయింది. మొత్తం 90 దేశాలనుంచి వచ్చిన 30 వేలమంది యువజనులు ఈ ఉత్సవంలో పాల్గొంటున్నారు.

లెనిన్ స్టేడియంలో ఇవాళ మొట్టమొదట జరిగిన యువజన ప్రతినిధివర్గాల ఊరేగింపులో సగంమందికి పైగా ఆసియా ఆఫ్రికా ఖండాలనుంచి వచ్చినవారున్నారు.

ప్రతినిధి వర్గాలవారు తమ తమ దేశాల జాతీయపతాకలతో కొందరు ముందునడవగా, వెనుక బారులుతీర్చి సైనిక శ్రేణుల మాదిరి నడవసాగారు.

సైప్రస్, గ్రీస్‌ల ప్రతినిధి వర్గాలవారు మాత్రం ప్రక్క ప్రక్కగా నడిచారు.

ఇవాళ ఊరేగింపులో చైనా రష్యాల కమ్యూనిస్టు నాయకులు మావ్ సే టుంగ్, వొరోషిలోవ్, కృశ్చేవ్ మొదలైనవారి చిత్రాలు లేవు.

ఈజిప్షియన్ ప్రతినిధివర్గం మాత్రం నాసర్ చిత్రం పెద్దదొకటి ఊరేగించారు.

జపాన్ ప్రతినిధివర్గం "ఇంక హిరోషిమా అనుభవాలు ఎవరికీ వొద్దు" అనే నినాదం వ్రాసిన పతాకతో ఊరేగింది.

"సోవియట్‌కు అమెరికన్ ప్రతినిధుల వందనం" అని వ్రాసిన పతాక అమెరికన్ యువజనులు ఊరేగారు.

ఊరేగింపు పూర్తిఅవగానే స్టేడియం చుటూ వరుసదీరి నిలబడివున్న రష్యన్ యువతులు సైనికశ్రేణిమాదిరే చకచకా బారులుబారులు గావచ్చి, స్టేడియం అంతటా పడినచెత్త ఎత్తివేశారు. ఇలాగే మాస్కో నగర వీథులన్నిటినీ నగరవాసులు క్షణంలో తుడిచివేశారు.

సోవియట్ రష్యా అధ్యక్షుడు శ్రీ వొరోషిలోవ్ ప్రపంచ యువజనులకు స్వాగతవచనాలు చెప్పారు. అవెంటనే శాంతిసూచకంగా రెండువేల పావురాలను, శాంతిపతాకలు కట్టి వేలాది బుడగలను ఎగురవేశారు. స్టేడియంలో ఒక ప్రక్క పెద్దబల్లపైన "శాంతి" అనే అక్షరాలలో అమర్చిన పసుపు పచ్చ విద్యుద్దీపాలు వెలిగాయి. 60 బండి బాకాలు యువజనులకు స్వాగతం పలికాయి.

స్టేడియంకు ఒకప్రక్క ఏర్పాటయిన ఉన్నత వేదికపై కృశ్చేవ్, బుల్గానిన్, ఝుకోవ్ లప్రక్క ఫ్రెంచి కమ్యూనిస్టు నాయకుడు మారిస్ థోరే, ఇటలీ కమ్యూనిస్టు నాయకుడు ల్యూగీలాంగో బల్గేరియా కమ్యూనిస్టు నాయకుడు ట్యోడర్ జివ్‌కోవ్ కూడా ఉన్నారు.

# కౌలాలంపూర్ చైనీయ సంఘం ఎన్నికలు

## ఆర్థికమంత్రిపక్షం ఓటమి

కౌలాలంపూర్, జూలై 28: మలయా చైనీయసంఘం కౌలాలంపూర్ శాఖ నేడు రవాణామంత్రి శ్రీ జంగ్ మోక్ లిన్‌పక్షం వారి వశమైంది. ఆర్థికమంత్రి కల్నల్ సర్ హెన్రీ హోపుషిక్ లీ అనుచరులందరు ఓడిపోయినారు.

ఈ శాఖసంఘం ఎన్నికలలో 70 స్థానాలు రవాణామంత్రి శ్రీ జంగ్‌పార్టీ వారికి దక్కాయి ఈ ఎన్నికలు పూర్తి అయిన తర్వాత సర్ హెన్రీ లీకొడుకు శ్రీ డగ్లస్‌లీ, ఈ ఎన్నికలలో చాలా అక్రమాలు జరిగాయన్నారు.

# కార్మిక వేతనాలపై టోరీ విధానం

లండన్, జూలై 29: కార్మికుల వేతనాలను నియమించాలని బ్రిటిష్ టోరీ ప్రభుత్వం చేస్తున్న ప్రయత్నాలు నెగ్గే ఎత్తు కన్పించడం లేదు.

బ్రిటన్‌లోకల్లా పెద్దదయిన,రవాణా, సాధారణ కార్మికుల సంఘం, టోరీ ప్రభుత్వం ప్రయత్నాలను, సూచనలను గూడా, తిరస్కరించేఎత్తులో వున్నట్లు తెలుస్తోంది.

ఈ సంఘం సెప్టెంబరులో సమావేశం అవుతుంది. అప్పుడు ఈ టోరీ ప్రయత్నాలను చర్చించి తిరస్కరిస్తుంది అంటున్నారు.

# డల్లెస్ లండన్ ప్రయాణం ఆంతర్యం

## రాజకీయవర్గాల ఊహలు

లండన్, జూలై 28: ఆయుధాల కంట్రోలువిషయమై, మొదటిఘట్టపు కార్యక్రమంలో భూమి, ఆకాశ మండలాలను నిర్ణయించడంకోసం సమాలోచనలు సాగించడానికి అమెరికా విదేశాంగమంత్రి శ్రీ డల్లెస్ ఇక్కడికి వస్తున్నట్లు పరిశీలకులు భావిస్తున్నారు.

పశ్చిమ రాజ్యాల నిరాయుధీకరణ పథకంలో ఈ విభాగం ఇంకా బయటపడలేదు. దీన్నిగూర్చి పశ్చిమ రాజ్యాల ప్రతినిధులు ఈమధ్య కొన్నివారాలుగా చర్చలుచేస్తూ, ఎన్నో పథకాలు తయారుచేశారు. ఇప్పుడు ఈ మండల నిర్మాణ వ్యవహారాన్నిగూర్చి, ఈ పశ్చిమరాజ్యాలమధ్య ఏకీభావం కుదరలంటే, తాను రాక పని జరగదని శ్రీ డల్లెస్ భావించి, ఆ ఏకీభావాన్ని సాధించడానికి వస్తున్నారనికూడా ఈ పరిశీలకులు అంటున్నారు.

ఇందులో ఇంకో తొందరకూడా వుంది. లండన్‌లో సాగుతున్న సమితి ఉపసంఘం సమాలోచనలను కొనసాగించడమా, మానుకోవడమా తేల్చవలసి వుంది. దీన్ని తేల్చడానికి పశ్చిమ రాజ్య నిరాయుధీకరణ పథకంలో అంతిమ అధ్యాయాన్ని కూడా ఆ ఉపసంఘం ముందు వుంచాలని శ్రీ డల్లెస్ భావిస్తున్నారు.

కంట్రోలు మండల నిర్మాణం అనగానే, అందులో ఎన్నో తగాదాలు వున్నాయి. ప్రస్తుతం హిమమండలు ధృవప్రాంతాల్లో ఈ మండలాలనువిర్పాటుచేస్తే సరిపోతుందని, ఐరోపాలో ఆ మండలాలను నిర్మించడం రాజకీయ కారణాల మూలంగా తొందరగా సాగకపోవచ్చునని శ్రీ డల్లెస్ భావంగా వున్నట్లు తెలుస్తోంది. అయితే ఒప్పందంకుదిరే ఎత్తువుంటే, ఐరోపాలో కంట్రోలు మండల నిర్మాణం తనకు అయిష్టం ఏమీ కాదని ఆయన అంటున్నాడంటున్నారు.

లండన్ సమాలోచనలలో పాల్గొంటున్న అమెరికా ప్రతినిధి శ్రీ స్టాసెన్ భావం ఇట్లా లేదు. ఆయన ఏదో విధంగా ప్రయోగాత్మక మార్గంలో అయినా సరే, ఐరోపాలో కంట్రోలు మండలాన్ని నిర్మించవలసిందేనని, ఆయుధాల తగ్గింపు వ్యవహారంలో రష్యా సహకారంతో, అనుభవజ్ఞానాన్ని సంపాయించడం ప్రధానమైన విషయం అని శ్రీ స్టాసెన్ వాదిస్తున్నారు.

అమెరికా అధ్యక్షుడుగూడా ఇదిచాలా ప్రధానమైన విషయంగా భావిస్తున్నారు. ముందు పశ్చిమరాజ్యాలమధ్య ఏకాభిప్రాయం కుదుర్చుకోవడం, తర్వాత రష్యా ఒప్పందం కుదుర్చుకోవడంకోసం గట్టిప్రయత్నం చేయడం అవసరమని శ్రీ ఐసెన్‌హోవర్ భావిస్తున్నారు.

ఐరోపాలో కంట్రోలు మండల స్వరూపాన్ని ఇప్పటికే పశ్చిమ రాజ్యాలు బహుపథకాలను తయారుచేశాయి. అందులో కొన్ని ఈమండలం అతివిస్తృతమై 10 డిగ్రీలు పశ్చిమ దీర్ఘాంశంనుంచి 60 డిగ్రీలు తూర్పు దీర్ఘాంశంవరకువ్యాపించివుంటడంమంచిదంటున్నవి వున్నాయి. పారిస్‌కు తూర్పున ప్రారంభమై,మాస్కో పశ్చిమ హద్దుదాకా ఈమండలం పరివ్యాప్తం అయివుండాలని ఇంకోపథకం తయారుచేశారు. ఇంత విస్తీర్ణంవుండే మండలం అయితే, పశ్చిమరాజ్యాలు ఆమోదిస్తాయట; లేకపోతే ఆమోదించవుట.

ఇందులో తమ "ఆకాశమండలాల" పథకాన్ని అంటిపెట్టుకుని, ఈ కంట్రోలు మండల నిర్మాణం సాగాలని పాశ్చాత్యరాజ్యాలకు లేదు. ఈ ఆకాశ మండల పరీక్షాపథకం జయప్రదం కావాలంటే, ఆమండల పరిధికి అవతలగూడా కంట్రోలు స్థావరాలు, పరీక్షా కేంద్రాలు వుండటం అవసరమని వీరు భావిస్తున్నారు.



## భారత ప్రభుత్వ తంతి & తపాలశాఖ. ఆంధ్ర సర్కిలు

ఈ సర్కిలుకు చెందిన దిగువ తెలిపిన రిక్రూటింగ్ యూనిట్లలో గుమాస్తాలు మరియు యితర కేడర్లలో ఉద్యోగములకు మెట్రిక్యులేషన్ లేదా అందుకు సమానమైన పరీక్షలో (I) ఇంగ్లీషు, (II) జాగ్రఫీ (III) లెక్కలు లేక అరిథ్‌మెటిక్స్ (IV) హిందీ లేక తెలుగు, హిందీ లేక తెలుగు లేనిపక్షమున సంస్కృతం పరీక్షలలో పొందిన మార్కులు ఆధారంపై అభ్యర్థులను ఎన్నుకొనబడును.

జీతం స్కేలు : రు. 60-4-120 EB 5-170 అమలులోనున్న కరువుభత్తెము.

వయోపరిమితి : టెలిగ్రాఫిస్టుల కేడరుకు 1-7-57 తేదికి 17 సం॥ లోపుగా గాని 24 సం॥ పైబడిగాని యుండరాదు. మిగత కేడర్లకు 1-7-57 తేదికి 18 సం॥లోపుగా గాని 24 సం॥ పైబడిగాని యుండరాదు. గరిష్ఠ వయోపరిమితి కొన్ని క్యాటగరీల వారికి, షెడ్యూల్డు కులములకు, జాతులకు చెందినవారికి సడలింపబడును.

అభ్యర్థులు నిర్ణీత ఫారములలో, వారు ఉద్యోగము కోరు ప్రదేశములోని రిక్రూటింగు యూనిట్ అధికారికి దరఖాస్తు పంపవలెను. నిర్ణీత దరఖాస్తు ఫారములు, యితరవివరములు ఆయా రిక్రూటింగ్ యూనిట్ అధికారి వద్దనుండి, పొందవచ్చును. యిండియన్ పోస్టల్ ఆర్డరు ద్వారా ఒక రూపాయి రిక్రూటింగ్ యూనిట్ అధికారికి చెల్లించి, అందుకై పొందిన రశీదును పంపవలెను. (షెడ్యూల్డు కులములకు జాతులకు చెందినవారు నాలుగు అణాలు మాత్రమే చెల్లించవలెను.) ఈ రుసుము వాపసు చేయబడదు.

నిర్ణీత ఫారములో దరఖాస్తు యితర డాక్యుమెంట్లు రిక్రూటింగ్ యూనిట్ అధికారికి 1957 ఆగస్టు 15వ తేది నాడుగాని అందుకు ముందుగాగాని చేరవలెను. పై తేదికి తర్వాత చేరిన దరఖాస్తులు అంగీకరించబడవు.

### రిక్రూటింగ్ యూనిట్స్

**గుమాస్తాలు (పోస్టల్)**

| | | |
|---|---|---|
| నెల్లూరు డివిజన్ | సూపరింటెండెంటు ఆఫ్ పోస్టుఆఫీసెస్, | నెల్లూరు. |
| కడప డివిజన్ | ,, | కడప. |
| గుంటూరు డివిజన్ | ,, | గుంటూరు. |
| తూర్పుగోదావరి డివిజన్ | ,, | రాజమండ్రి. |
| పశ్చిమగోదావరి డివిజన్ | ,, | ఏలూరు. |
| కృష్ణా డివిజన్ | ,, | చిలకలపూడి. |
| విశాఖపట్నం డివిజన్ | ,, | విశాఖపట్నం. |

**గుమాస్తాలు (టెలిగ్రాఫ్ ఆఫీసులు)**

| | |
|---|---|
| విజయవాడ టెలిగ్రాఫ్ ఆఫీస్. | సూపరింటెండెంటు-ఇన్-చార్జి, CTO విజయవాడ. |
| విశాఖపట్నం టెలిగ్రాఫ్ ఆఫీసు: | సూపరింటెండెంట్-ఇన్-చార్జి, CTO విశాఖపట్నం. |

**సార్టర్లు**

| | |
|---|---|
| ఆర్. ఎం. ఎస్. Y డివిజన్— | సూపరింటెండెంటు, Y డివిజన్, విజయవాడ. |

**టెలిఫోన్ ఆపరేటర్లు :**

| | |
|---|---|
| కర్నూలు యింజనీరింగ్ డివిజన్: | డివిజనల్ యింజనీరు, టెలిగ్రాఫ్స్ కర్నూలు. |
| విశాఖపట్నం ఇంజనీరింగ్ డివిజన్: | డివిజనల్ ఇంజనీరు, టెలిగ్రాఫ్స్, విశాఖపట్నం. |

**టెలిగ్రాఫిస్టులు :**

డైరెక్టర్, పోస్టు & టెలిగ్రాఫ్స్, ఆంధ్ర సర్కిలు, కర్నూలు.

**G T O లో యితర గుమాస్తాలు**

డైరెక్టర్, పోస్టు & టెలిగ్రాఫ్స్, ఆంధ్ర సర్కిల్, కర్నూల్.

డైరెక్టర్ ఆఫ్ పోస్టు & టెలిగ్రాఫ్స్, కర్నూలు.

## గంటల పంచాంగం

శ్రీ హేమలంబ సం॥ శ్రావణ శు॥ పంచమి 1957 సం॥ జూలై 31 బుధవారం
బుధ॥ పంచమి 17-3 హస్త 9-18
వర్జ్యం 17-1 ల 18-30 ని.
గురు॥ షష్ఠి ఆగస్టు 1 గురువారం
శు॥ షష్ఠి 14-48 చి॥ 37-30
వర్జ్యం 15-8 ల 16-40 ని

ఆంధ్రపత్రిక

ఒరులేయవి యొనరించిన
నరవర యప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమధర్మ పథములకెల్లన్
(మహాభారతము)

శ్రీ హేమలంబ సం॥ శ్రావణ శు॥ పంచమి
బుధవారం

## సరిహద్దు సమస్యలు: కేంద్రప్రభుత్వబాధ్యత

ఆంధ్ర, మద్రాసు సరిహద్దు సమస్యను పరిశీలించిన శ్రీ పటాస్కర్ వారి నివేదికను కేంద్ర ప్రభుత్వానికి అందజేసినట్లు కూడా అధికార రీత్యా వెల్లడి కాలేదు. నివేదికాంశాలపై మాత్రం ధారాళంగా ఊహాగానం జరుగుతూ వున్నది. ఆంధ్ర ప్రభుత్వానికి గాని, మద్రాసు ప్రభుత్వానికి గాని నివేదిక విషయాలు తెలియలేదని ముఖ్యమంత్రులు ప్రకటించారు. అయినా సరిహద్దు ప్రాంతాల ప్రజలు ముఖ్యంగా తిరుత్తణి తాలూకాలోని ఆంధ్రులు తీవ్ర ఆందోళన చెందుతున్నారు. ఆ ప్రాంతానికి చెందినవారు కొందరు క్రిందటి ఆదివారం మద్రాసులో ఆంధ్ర ముఖ్య మంత్రిని, ఆంధ్రకాంగ్రెస్ అధ్యక్షుణ్ణి కలుసుకొని వారి ఆందోళనను తెలుపుకున్నారు. ఆంధ్ర ముఖ్యమంత్రి గాని, ఆంధ్ర కాంగ్రెస్ అధ్యక్షుడుగాని వీరికి ధైర్యం చెప్పలేకపోయినారు.

"తిరుత్తణి మద్రాసు రాష్ట్రంలో చేరాలని శ్రీ పటాస్కర్ అభిప్రాయపడ్డం అన్యాయం" అని తిరుత్తణి తాలూకా ప్రతినిధులు చెప్పగా "న్యాయం ఎక్కడున్నది?" అని శ్రీ సంజీవరెడ్డిగారు ప్రశ్నించారు. శ్రీ అల్లూరి సత్యనారాయణరాజుగారున్నూ ఇంచుమించు ఇదే విధంగా సమాధానం చెప్పారు. "ఏ సమస్యకైనా ఎక్కడో అక్కడ అంతం వుండాలిగదా" అన్నారు ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుడు. శ్రీ పటాస్కర్ వెల్లడించే అభిప్రాయాలు న్యాయస్థాన తీర్పు వంటివి కావని అయినా పెద్ద మనుషుల ఒప్పందం అనుసరించి ఆ అభిప్రాయాలను రెండువపక్షాల వారూ అంగీకరింపవలసి వుంటుందని శ్రీ సంజీవరెడ్డిగారు ఇదివరకే ప్రకటించారు. శ్రీ అల్లూరి సత్యనారాయణరాజుగారు శ్రీ పటాస్కర్ ప్రతిపాదనలపై తుది నిర్ణయాన్ని ప్రకటింపవలసింది కేంద్రప్రభుత్వం అన్నారు. కేంద్రప్రభుత్వం ఈ నిర్ణయాన్ని ఎప్పుడు ప్రకటిస్తుందో తెలియదు. నిర్ణయానికి వచ్చే ముందు దేశీయ వ్యవహారాల మంత్రి శ్రీ గోవిందవల్లభపంత్ గారు ఆంధ్ర, మద్రాసు ముఖ్యమంత్రులతో చర్చిస్తారని మాత్రం తెలుస్తున్నది.

సరిహద్దుల విషయంలో జరిగిన ఏ విచారణా ఆంధ్రులకు అనుకూలంగా లేదు. బళ్ళారి విషయంలో న్యాయం జరుగుతుందని ఆశించి విచారణార్థి కారిని నియమింపమని కేంద్ర ప్రభుత్వాన్ని కోరితే న్యాయమూర్తి మిశ్రా తీర్పులభించింది. శ్రీ పటాస్కర్ తీర్పు ఇందుకు భిన్నంగా వుండేటట్లు కన్పించదు. సరిహద్దుల వ్యవహారాన్ని అమూలాగ్రంగా పరిశీలించి నిర్ణయం చేయడానికి అవకాశం లేనిపక్షంలో సరిహద్దులను సవరించడానికి ప్రయత్నింపకపోవడం అందరికీ శ్రేయస్కరం. కనుకనే ఆంధ్ర మంత్రులు, మద్రాసు మంత్రులలో హెచ్చుమంది ఆంధ్ర - మద్రాసు సరిహద్దులను 1956 నవంబరు 1 న వున్నట్లే వుంచివేయడం మంచిదనే అభిప్రాయాన్ని వెల్లడిస్తూ వచ్చారు. అయితే మద్రాసు మంత్రులలో కొందరికి సరిహద్దు వ్యవహారం రాజకీయ సమస్యగా తయారైంది. సరిహద్దుల మార్పును సాధింపలేకపోతే తమిళనాడులో కాంగ్రెసు పలుకుబడి తగ్గిపోతుందేమో అన్న భయం కొందరికి కలిగింది. అందువల్ల సరిహద్దుల మార్పు ఆందోళన సమంజసమైనదా కాదా అన్న ఆలోచనలేక కాంగ్రెసు ప్రముఖులున్నూ సరిహద్దు ఆందోళనలో పాల్గొంటూ వచ్చారు. ఇప్పటి సరిహద్దులలో ఏమార్పు జరిగినా ఒకవైపున ఆందోళన తగ్గవచ్చును. మరొక వైపున ఆందోళన అధికం కావచ్చును. కేంద్రప్రభుత్వం ఈ విషయాలన్నింటినీ విచారించి ఈ వ్యవహారాన్ని మరి కొంతకాలం వాయిదా వేయడం మంచిది. కేంద్రప్రభుత్వం వివేకంతోనూ సాహసంతోనూ వ్యవహరింపవలసి వుంటుంది.

## ప్రజా ప్రతినిధులు సహకరించలేదు

(1 వ పుట తరువాయి)

బీహార్) చెప్పారు.

అభివృద్ధి కేంద్రాల సలహాసంఘాలు ప్రజలకు ఇతోధికంగా ప్రాతినిధ్యం వహించేటట్లు చేయాలని శ్రీ కె. కుమారన్ (కమ్యూ-కేరళ) చెప్పారు. ప్రజలకు విద్య గరపితే తప్ప ప్రజా ఉద్యమంగా ఈ కార్యక్రమం సఫలం కాదని డాక్టర్ కె. బి. మీనన్ (పి. ఎస్. పి. కేరళ) అన్నారు.

సమాజాభివృద్ధి శాఖ తన కార్యకలాపాలు వివరిస్తూ ఇప్పటివలె చాల పత్రికలు కాక ఒకే పత్రిక ప్రచురించాలని శ్రీ భక్తదర్శన్ (కాం-ఉ. ప్రదేశ్) చెప్పారు.

ఆదిమవాసుల ప్రాంతాలవిషయంలో ఎక్కువ శ్రద్ధ చూపాలని శ్రీ సి. ఎమ్. కేడారియా (కాం-బొంబాయి) చెప్పారు. ఈ శాఖవల్ల ప్రయోజనం ఏమీ లేదు కనుక దానిని ఎత్తివేయవచ్చునని శ్రీ జగదీశ్ అవస్థి సోష-ఉ. ప్రదేశ్) అన్నారు.

### పరీక్షా ఫలితాలు

సమాజాభివృద్ధి శాఖ కార్యకలాపాలను సమీక్షిస్తూ శ్రీ డే ఇలా చెప్పారు:

సమాజాభివృద్ధి కార్యక్రమాలు నిర్వహించడంలో ప్రభుత్వ వ్యవస్థలోను, ప్రజా సంస్థలలోను ఉన్న లోపాలు తెలుసుకొనడంలో ఆ శాఖ 'ఘనమైన విజయం' సాధించినది.

వివిధ ప్రభుత్వ శాఖల కృషి సమన్వయ పరచడంలో కేవలం 'ఉత్తీర్ణ' మైనది.

కాని ప్రజా ప్రతినిధుల సహకారం పొందడంలో 'విగిపోయినది.'

ఇక నిర్మాణ కార్యక్రమాల నిర్వహణకు ఏర్పరచిన లక్ష్యాల సాధనలో 'రెండవ తరగతి'లో మాత్రమే ఉత్తీర్ణమైనది.

## రాజస్థాన్ వరదలు

### అనేకలక్షలు విలువగల ఆహారధాన్యాలు ఆస్తినష్టం

జైపూర్, జూలై 29: గతవారం అంతా తెరిపిలేకుండా కురిసిన వర్షాల మూలంగా కల్యంచా తటాకానికి గండ్లుపడి భారన్ పట్నం వరదలకు గురిఅయింది. పట్నంలోని కొన్ని ప్రాంతాలు 7 అడుగులలోను నీటిలో మునిగిపోయాయి.

ఈవరదల్లో, అనేక లక్షల రూపాయలు విలువగల ఆస్తి, ఆహార ధాన్యాలకు నష్టం సంభవించిందని యిక్కడికి వచ్చిన వార్తలవల్ల తెలుస్తున్నది.

నాలుగువందలపైచిలుకు కచ్చాయిళ్లు కూలిపోయాయి.

# కేంద్రప్రభుత్వోద్యోగుల వేతన పరిశీలక సంఘం

## విచారణీయాంశాలపై ఈవారంలో ప్రకటన

న్యూఢిల్లీ, జూలై 29: కేంద్ర ప్రభుత్వోద్యోగుల వేతన విధానాల పరిశీలనకు నియమించనున్న సంఘం విచారించవలసిన అంశాలను గురించి, ఇవాళ మళ్లీ కేంద్రమంత్రి మండలి చర్చించినట్లు తెలుస్తున్నది.

తంతితపాలా సిబ్బంది ప్రతినిధులతో క్రిందటివారం ప్రభుత్వం సాగించిన రాయబారాలు విఫలమైనందువల్ల, పరిస్థితులను మంత్రి మండలి చర్చించింది.

వేతన పరిశీలక సంఘ నియామకం, విచారణీయాంశాలు ఈ వారంలోనే ప్రకటితం కాగలవని అధికార వర్గాలవారు చెపుతున్నారు.

తాత్కాలికంగా ఉద్యోగులకు ఏ మిహ్యాలనే విషయంకూడా ఈ పరిశీలక సంఘం పరిశీలించి తెలపాలని ప్రభుత్వం అడగవచ్చునని కూడా వీరు చెపుతున్నారు.

## రాజీ చర్చల వైఫల్యం

### తంతి తపాలా సిబ్బంది ఉపసంహరణ

న్యూఢిల్లీ, జూలై 29: తంతి తపాలా సిబ్బంది జాతీయ సమాఖ్య కార్యాచరణ సంఘం ఇవాళ ఛీఫ్ లేబర్ కమీషనరు ఏర్పాటు చేసిన రాజీ సమాలోచనల నుండి ఉపసంహరించుకొన్నారు:

ఉపసంహరణకు కార్యాచరణ సంఘం ఈ క్రింది కారణాలను వివరించింది:

తంతి తపాలా సిబ్బంది జాతీయ సమాఖ్య అభిప్రాయాలను కార్యాచరణ సంఘం ఛీఫ్ లేబర్ కమీషనర్ కు పూర్తిగా వివరించి, ప్రభుత్వం అభిప్రాయాలను తెలపవలసిందని వారిని కోరింది. వారు ప్రభుత్వ అభిప్రాయాలను కాని, చివరకు ప్రభుత్వం సూచించిన పరిశీలక సంఘ నియామకం గురించిన వివరాలనుకాని తెలపలేకపోయారు.

వేతన పరిశీలక సంఘ నియామకం కాక, సమాఖ్య అడిగిన ఇతర కోర్కెల విషయంలో పరిస్థితి ఏమీ మారనేలేదు. అందువల్ల ఛీఫ్ లేబర్ కమీషనర్ సామరస్య సమాలోచనలు విఫలమైనాయన్నమాట. ఇందుకు సమాఖ్య బాధ్యత ఎంతమాత్రం లేదు.

తంతితపాలా సంఘాల నాయకులను, కార్యవర్గ ముఖ్యులను క్రమం తప్పి బదిలీలుచేస్తూ బాధలు పెడుతున్నందుకు కార్యాచరణసంఘం చూస్తూ ఊరుకోలేదు. సిబ్బందిని భయపెట్టాలని అధికారులు ప్రయత్నిస్తున్నట్లు అనుమానం కలుగుతున్నది. ఇటువంటి చర్యలవల్ల సిబ్బందిలో ఐక్యభావం బలపడుతున్నది. త్వరలో ప్రారంభించనున్న సమ్మె జయప్రదంగా సాగుతుందని కార్యాచరణ సంఘం విశ్వసిస్తున్నది.

## సానుభూతి సమ్మెల్లో నమ్మకం లేదు

### తంతి తపాలా సమాఖ్యకు వాసవాడా జవాబు

అహమ్మదాబాదు, జూలై 29: గాంధీజీ అడుగుజాడల్లో కార్మికోద్యమం నడిపే తమవంటి వారికి సానుభూతి సమ్మెలలో నమ్మకంలేదని చెపుతూ, భారత జాతీయ కార్మిక సంఘాల కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ యస్. ఆర్. వాసవాడా, ఆగస్టు 8 నుంచి సమ్మె చేయవద్దని తంతి తపాలా సిబ్బంది సమాఖ్యకు విజ్ఞప్తి చేశారు.

సమ్మెకు దిగకుండా, ఈ సమాఖ్య, తన కోర్కెలన్నిటినీ, ప్రభుత్వం ఏర్పాటు చేస్తున్న పరిశీలక సంఘానికి తెలియపరచి తీర్పు కోడానికి ప్రయత్నించవలసిందనికూడా శ్రీ వాసవాడా విజ్ఞప్తి చేశారు.

ప్రస్తుత పరిస్థితులలో ఇటువంటి సమ్మెవల్ల, తంతి తపాలా సిబ్బందికీ, ప్రభుత్వానికీ, ప్రజలకూ కూడా ఎంతో హాని కలుగుతుందని హెచ్చరించారు. చిక్కులను న్యాయంగా పరిష్కరించుకోడానికి ప్రభుత్వం ఏర్పాటు చేసిన సాధనం ఉన్నంతవరకూ సమ్మెకు దిగకూడదు.

తంతి తపాలా సిబ్బంది కోర్కెలు తీర్చడానికి ప్రభుత్వంతో మాట్లాడి సహాయం చెయ్యవలసిందనీ, ఈ ప్రయత్నం ఫలించకపోతే, రైల్వే మొదలైన శాఖలను కూడా తమకు తోడ్పాటుగా తీసుకురావలసిందనీ తంతి తపాలా సిబ్బంది సమాఖ్య తమకు చేసిన విజ్ఞప్తికి శ్రీ వాసవాడా ఈ క్రిందివిధంగా జవాబిచ్చారు:

గాంధీ మహాత్ముని అడుగుజాడల్లో నడవాలని ప్రయత్నించే భారతజాతీయ కార్మికసంఘాల కాంగ్రెస్ కు సానుభూతి సమ్మెలలో విశ్వాసం లేదు. గాంధేయ కార్మికోద్యమ సేవకులైన తమకు తమ హద్దులు తెలుసు. అందువల్ల ఇతరులుచేసేది తప్పని అనడంలేదు. కాని అభిప్రాయభేదాలు వచ్చినప్పుడు రెండు పక్షాలూ కలుసుకుని సామరస్యంతో పరిష్కరించుకోడం వివేకం, ఉచితం అని తెలుసు. సామరస్య కృషి ఫలించనప్పుడు పరిష్కృత్యానికి ఒప్పుకోవాలి.

ప్రధాని శ్రీ నెహ్రూతో చర్చల సందర్భంలో ఇతర కోర్కెల ప్రసక్తి రాలేదని పత్రికలవల్ల తెలుస్తున్నది. ఇవన్నీ ప్రభుత్వం నియమించనున్న వేతన పరిశీలక సంఘానికి తెలపవచ్చును.

అందువల్ల ప్రస్తుత పరిస్థితులలో, సమ్మె ఫలితాలు దారుణంగా ఉంటాయి. ఏమైనప్పటికీ, సమ్మె చెయ్యదలచిన వారికి వారి అభిప్రాయాలను, ముఖ్యంగా వేతన పరిశీలన సంఘనియామకం గురించిన అభిప్రాయాలను తెలియపరిచే అవకాశం ఇవ్వాలి.

ప్రభుత్వం ఈ పరిశీలక సంఘాన్ని వీలైనంత త్వరలో తాత్కాలిక సూచనలు చెయ్యాలని అడగాలి.

కార్మిక వివాదాలపై సమాలోచనల కోసం శాశ్వతంగా ప్రభుత్వం ఏర్పాటు చేసిన యంత్రాంగం ఉండనే ఉంది. ఇటువంటి సమాలోచనల ద్వారా పెద్ద పెద్ద వివాదాలు చాలానే పరిష్కారమైనాయి. ఇటువంటిసాధన ఉన్నంత కాలం, రైల్వే కార్మికులను సమ్మె చెయ్యాలని అడగవలసిన అవసరం లేదు, అని శ్రీ వాసవాడా అన్నారు.

## సాంకేతిక నిపుణులు

### ఉద్యోగ నియామకానికి కొత్త పద్ధతి

న్యూఢిల్లీ, జూలై 29: శాస్త్రజ్ఞులు, సాంకేతిక నిపుణులకు ఉద్యోగాలివ్వడంలో కొత్తపద్ధతి ఒకటి అనుసరించాలని, కేంద్ర ప్రభుత్వోద్యోగ నియామక సంఘం (యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమిషన్) నిర్ణయించినట్లు ఇవాళ అధికారప్రకటన వెలువడింది.

ఒకే రకం శిక్షణ, విద్య, అనుభవం కల అభ్యర్థులు అవసరమైన ఉద్యోగాలన్నింటినీ, కలబోసి, ఆ ఖాళీలకు శాస్త్రజ్ఞులను, నిపుణులను ఒకేసారి నియమించాలని వీరి ఉద్దేశం. దీనివల్ల ఒక్కొక్క ఉద్యోగానికీ ప్రకటనలు చెయ్యవలసిన బాధ తప్పుతుంది; అసలే అనుభవజ్ఞులు నిపుణులు కొరవగాఉన్న ప్రస్తుత పరిస్థితులలో ఉన్నవారిని అవసరాలకు సక్రమంగా వినియోగించుకోవడానికీ వీలు కలుగుతుంది.

పైగా అనుభవాన్ని గురించి ఒక చిక్కు ఉంది. చాల ఉద్యోగాలకు అనుభవంకల నిపుణులు శాస్త్రజ్ఞులు కావాలి. కాని అనుభవంకలవారు నిజంగా చాలినంతమంది దొరకడం లేదు. అందువల్ల బొత్తిగా అనుభవం లేనివారినీ, కొంత అనుభవం కలవారినీ కూడా ఈ ఉద్యోగాలకు దరఖాస్తులు పెట్టుకో నిచ్చేవిధంగా ప్రకటనల పద్ధతి మారుస్తారు. అనుభవం ఉండితీరాలని కాకుండా, ఉంటే, ఇతరులకంటె అర్హులు, అని తెలిసేలా ప్రకటిస్తారు. అప్పుడు అనుభవలోపం తీర్చడానికి ప్రభుత్వమే అనుభవంలేని వారినికూడా నియమించి, వారికి అవకాశాలు ఇస్తుంది.

ఇవి కాకుండా, బ్రిటన్‌లో మాదిరిగా, ఖాళీలకు చాలినంత మంది అభ్యర్థులు ఉండని ఉద్యోగాలలో, నిత్యం పోటీ జరుపుతూ, క్రమక్రమంగా వచ్చేవారిని వచ్చినప్పుడే ఉద్యోగాలలోకి తీసుకునే పద్ధతికూడా ఒకటి అమలుజరిపే విషయాన్ని, కేంద్ర ప్రభుత్వోద్యోగ నియామక సంఘం ఆలోచిస్తున్నది.

## ఆహారధాన్యాల కనీస ధరలు

### గిట్టుబాటు కానప్పుడే నిర్ణయం

న్యూఢిల్లీ, జూలై 29: ఆహార ధాన్యాలు, తదితర వ్యవసాయ ఉత్పత్తుల ధరలు, గిట్టుబాటు స్థాయికంటె పడిపోయినప్పుడే, కనీస ధరలను నిర్ణయించేందుకు ప్రభుత్వం తగు చర్యలు తీసుకుంటుందని ఆహార వ్యవసాయ శాఖ మంత్రి శ్రీ అజిత్ ప్రసాద్ జైన్ లోక్‌సభలో చెప్పారు. ప్రస్తుతం, యీ ధరలు అధికంగానే ఉన్నాయన్నారు.

శ్రీమతి తారకేశ్వరి సిన్హా ప్రశ్నకు సమాధానం చెప్తూ, యీ ధరలను ఒక స్థాయిలో ఉంచేందుకు చర్యలు తీసుకున్నామనీ, ధరలు పడిపోవటం జరిగితే ప్రభుత్వం, ఆహార ధాన్యాలను కొనటం ఆరంభిస్తుందనీ శ్రీ జైన్ తెలియజేశారు.

శ్రీమతి సిన్హా: ఆంధ్ర మండలంలోని మిగులు ప్రాంతాలు, లోటు ప్రాంతాలకు ధాన్యాలను పంపలేకపోతున్నాయి.

శ్రీ జైన్: కలకత్తా, బొంబాయిలకు చేరి 10 వేల టన్నుల ధాన్యాలను పంపటానికి ఆంధ్రకు పర్మిట్లు యిచ్చాము.

## నెహ్రూ ఎన్నిక

### అలహాబాదు హైకోర్టుకు రిట్ దరఖాస్తు

అలహాబాదు, జూలై 29: శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ ఎన్నిక చెల్లదని అధిక్షేపిస్తూ తాను పెట్టుకొన్న దరఖాస్తుపై విచారణ జరపకుండా ఎన్నిక న్యాయస్థానాన్ని నిషేధిస్తూ ఉత్తర్వు జారీచేయమని కోరుతూ, క్రిందటి సాధారణ ఎన్నికలలో నెహ్రూతో పోటీచేసిన శ్రీ సీతారామ్ ఖేంకా ఈ రోజున అలహాబాద్ హైకోర్టులో డివిజన్ బెంచికి రిట్ దరఖాస్తు పెట్టుకొన్నారు. ఎన్నిక న్యాయస్థానం సక్రమంగా ఏర్పడిన న్యాయస్థానం కాదని ఆయన అధిక్షేపించారు.

ఎన్నిక న్యాయస్థానంలో శ్రీ కె. కె. బెనర్జీ ఒక్కరే సభ్యులు, తన ఎన్నిక దరఖాస్తుపై విచారణ జరిపే అధికారం ఆ న్యాయస్థానానికి లేదని అధిక్షేపిస్తూ శ్రీ ఖేంకా పెట్టుకొన్న దరఖాస్తును ఎన్నిక న్యాయస్థానం క్రిందటి శనివారం త్రోసిపుచ్చినది. సక్రమంగా ఏర్పడిన న్యాయస్థానమేనని, ఎన్నిక దరఖాస్తుపై విచారణ జరిపే అధికారం ఉన్నదని ఎన్నిక న్యాయస్థానం నిర్ణయించినది.

శ్రీ ఖేంకా రిట్ దరఖాస్తు న్యాయమూర్తులు శ్రీ వి. భార్గవ, శ్రీ వి. దయాళ్ ఎదుట విచారణకు వచ్చినది. శ్రీ బెనర్జీకి తనకు అధికారం ఉన్నది లేనిది నిర్ణయించే అధికారం లేదని శ్రీ ఖేంకా వాదించారు. అందువల్ల ఎన్నిక దరఖాస్తుపై ఆయన విచారణ జరపడానికి అనుమతించరాదని శ్రీ ఖేంకా నివేదించారు. తన రిట్ దరఖాస్తుపై తీర్పు చెప్పేలోగా ఎన్నిక న్యాయస్థానం విచారణ నిలుపుచేస్తూ ఉత్తర్వు చేయమనికూడా ఆయన కోరారు. అలహాబాదు జిల్లాలో మూడు ఎన్నిక న్యాయస్థానాలు పనిచేస్తున్నవని, అట్టి నియామకం విభజన పూర్తిగా తైవదని, రాజ్యాంగ చట్టంలో 14 వ నిబంధనకు విరుద్ధమని శ్రీ ఖేంకా వాదించారు.

### నెహ్రూ తరఫున ఆక్షేపణ

శ్రీ ఖేంకా ఎన్నిక దరఖాస్తుపై విచారణ జరుపుతున్న ఎన్నిక న్యాయస్థానంలో శ్రీ నెహ్రూ తరఫున శ్రీ ఎస్. కె. దార్ ఆ దరఖాస్తు చెల్లదని ఈ రోజున అధిక్షేపించారు. ప్రజాప్రాతినిధ్యచట్టం 90 (3) వ నిబంధన క్రింద దానిపై విచారణ జరపరాదని, దానిని త్రోసిపుచ్చాలని శ్రీ దార్ నివేదించారు. ఫుల్పూర్ ద్విసభ్య నియోజకవర్గం నుంచి ఎన్నిక అయిన పండిత నెహ్రూ, శ్రీ మసూరి యాదిన్ కాక పోటీలో పాల్గొన్న అభ్యర్థులు మరి నలుగురు ఉన్నారని, దరఖాస్తుదారు వారిని ప్రతివాదులుగా పేర్కొనలేదని, 82 వ నిబంధన ననుసరించి వారందరిని ప్రతివాదులుగా పేర్కొనడం అవశ్యకమని, ఆ కారణంచేత దరఖాస్తును ఎన్నిక కమిషన్ త్రోసిపుచ్చాలని శ్రీ దార్ వాదించారు. ఆ లోపాన్ని చూపుతూ దరఖాస్తు చెల్లేది చెల్లనిది ఎన్నిక న్యాయస్థానమే నిర్ణయించాలని ఎన్నిక కమిషన్ కోరినదనికూడా ఆయన సూచించారు.

శ్రీ దార్ తన వాదం ఇంకా పూర్తి చేయలేదు.

అంతకుముందు తన దరఖాస్తుపై విచారణ జరపడానికి ఎన్నిక న్యాయస్థానానికి అధికారంలేదనీ, తాను ఈ విషయమై సుప్రీంకోర్టుకు అప్పీలుచేసేలోగా రెండు నెలలవరకు ఈ విచారణ నిలుపుచేయాలని కోరుతూ శ్రీ ఖేంకా పెట్టుకొన్న రెండు దరఖాస్తులను న్యాయస్థానం త్రోసిపుచ్చినది.

## వ్యవసాయపరిశోధకులకు బహూకృతులు

### రఫీ అహ్మద్ కిద్వాయి స్మృత్యర్థం

న్యూఢిల్లీ, జూలై 28: వ్యవసాయ పరిశోధనలో కొత్తవిషయాలను కనిపెట్టినవారికి రఫీ అహ్మద్ కిద్వాయి స్మారక బహూకృతులను యీ సంవత్సరంనుంచి భారత వ్యవసాయ పరిశోధనపరిషత్తువారు ఏర్పాటు చేస్తున్నారు.

ఈ బహూకృతులు మొత్తం 11 దాకా ఉంటాయి. ప్రతి బహుమతి రు 5000 లు ఉంటుంది. బంగారపు పతకాలరూపంలోను, డబ్బు రూపంలోను, లేక రెండురకాలుగాను, వీటిని ప్రసాదిస్తారు. పరిశోధనలో ఒకరు కొత్తవిషయాన్ని కనిపెట్టినా, ఇద్దరు కలిసి కనిపెట్టినా, ఈ బహూకృతి లభిస్తుంది.

ఈ బహుమతులను యెవరికి యివ్వవచ్చో నిర్ణయించడానికి భారత వ్యవసాయ పరిశోధన పరిషత్తువారు, ప్రఖ్యాత శాస్త్రవేత్తలతో ఒకసంఘాన్ని వేస్తారు. వారి సిఫార్సులను బట్టి ఈ బహుమతులను ఇస్తారు.

ఈ క్రింది విషయాలలో పరిశోధనలకు ఈ బహుమతులు ఉంటాయి: (1) వ్యవసాయశాస్త్రం, (2) వ్యావసాయక సంబంధి ఇంజనీరింగు, (3) వ్యావసాయక రసాయనశాస్త్రం, (4) వ్యావసాయక వృక్షశాస్త్రము, (5) వ్యావసాయక జంతుశాస్త్రము, (6) పండ్లు, తోటలు పరిశ్రమ, (7) పసు పోషణ, (8) పసు ఆహారశాస్త్రం (9) పసుఆమయశాస్త్రం, (10) పాల పరిశ్రమ, (11) వ్యావసాయక ఆర్థిక శాస్త్రము.

# జిల్లా బోర్డుల పునర్నిర్మాణ సమస్యపై ఏకాభిప్రాయంలేదు!

## ప్రదేశ్ కాంగ్రెసు కార్యవర్గం, శాసనసభా కాంగ్రెసు పరిశీలన

హైదరాబాదు, జూలై 29: ఆంధ్ర ప్రాంతంలో జిల్లా బోర్డులను పునరుద్ధరించే సమస్యపై ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు కార్యవర్గం, శాసనసభా కాంగ్రెసు ఉమ్మడి సమావేశంలో ఏకాభిప్రాయం కుదరలేదని తెలిసింది.

రాష్ట్రబడ్జెట్ లో రాగల దాదాపు ఐదరకోట్ల లోటును భరీచేసేందుకు బడ్జెట్ ప్రసంగంలో ఆర్థిక మంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డి సూచించిన కొత్త పన్నులను ఈ ఉమ్మడి సమావేశం పరిశీలించింది. ఆర్థికమంత్రి సూచనలను పార్టీ సభ్యులు దాదాపు ఏకగ్రీవంగానే ఆమోదించారని పార్టీనాయకులలో ఒకరు చెప్పారు.

ఆంధ్రప్రాంతంలోని జిల్లాబోర్డులకు 1953 నుంచి ఇంతవరకూ ఎన్నికలు జరగలేదు. వాటికి ఎన్నికలు జరిపి తెలంగాణా ప్రాంతంలో జిల్లాబోర్డులను ఏర్పాటుచేసే సమస్యను కూడా సమావేశం పరిశీలించింది. ఈ సమస్యపై సభ్యులు విభిన్నాభిప్రాయాలు వెలిబుచ్చారట; వెంటనే ఎన్నికలు జరిపించాలని కొందరు సభ్యులన్నారట. ఈ జిల్లాబోర్డుల ఆర్థికస్థితి అధ్వాన్నంగా ఉన్న ఈ పరిస్థితులలో దాదాపు రు 35 లక్షలు వెచ్చించి ఎన్నికలు జరపడంఏమంత తెలివిగలపని? అనికొందరు ప్రశ్నించారట. పరోక్ష ఎన్నికల ద్వారా ఆంధ్రప్రాంతంలోని జిల్లా బోర్డులను పునరుద్ధరించవలసింది గా కొందరు సభ్యులు సూచించారట. మొత్తంమీద ఈ సమస్యపై సమావేశంలో ఏకాభిప్రాయం కుదరలేదని తెలిసింది.

ఆంధ్ర ప్రాంతంలోని జిల్లాబోర్డులు 1953 నుంచీ ఇంతవరకూ ప్రత్యేకాధికారుల పర్యవేక్షణలో ఉన్న సంగతి పాఠకులకు తెలిసినదే.

అవిభక్త హైదరాబాదు రాష్ట్ర ప్రభుత్వం జిల్లాబోర్డుల చట్టాన్ని ఆమోదించిన తరువాత తెలంగాణా ప్రాంతంలో ఇంతవరకూ జిల్లాబోర్డులు ఏర్పడలేదు. తెలంగాణా ప్రాంతంలోని జిల్లాబోర్డులకుకూడా వయోజనవోటింగు పద్ధతిలో ఎన్నికలు జరపడానికి వినియోగపడే బిల్లును ప్రత్యేక గెజెట్ లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రకటించిన సంగతి పాఠకులకు తెలిసినదే.

ఆంధ్ర ప్రాంతంలోని పదకొండు జిల్లాబోర్డులూ లోటు బడ్జెటుతోనే పని చేస్తున్నవి.

తెలంగాణా ప్రాంతంలోని జిల్లా బోర్డులవద్ద రెండు లక్షల వెందలు ఏనిమిది లక్షలదాకా డబ్బునిలవ ఉన్నది. దాదాపు ఈ మిగులు డబ్బుంతా జిల్లా బోర్డుల ఎన్నికలు జరపడానికే సరిపోతుంది. రాష్ట్రమంతటా జిల్లాబోర్డులకు ఎన్నికలు జరపడానికి రు 85 లక్షల దాకా అవుతుందని అంచనా. అంటే ఎన్నికలు జరగగానే జిల్లా బోర్డులు పరిపాలనను నిర్వహించేందుకు ప్రభుత్వం వాటికి విరివిగా అప్పులు ఇవ్వవలసి వస్తుందన్న మాట!

అయినాసరే-పరిపాలనానిర్వహణను వికేంద్రీకరణ పద్ధతిలో జరపాలి కనుక-ప్రజాస్వామిక విధానం ప్రకారం రాష్ట్రమంతటా సంవత్సరంలోగా జిల్లాబోర్డులకు ఎన్నికలను జరిపించాలని సభ్యులలో ఎక్కువ మంది అభిప్రాయమిచ్చారని తెలుస్తోంది.

సమావేశానికి ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు అధ్యక్షత వహించారు.

భూమిసంస్కరణలసమస్య ఈసమావేశంలో చర్చకు రానే రాలేదట.

ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు కార్యవర్గమూ, శాసనసభా కాంగ్రెసూ ఆగస్టు మూడు - నాలుగు వారాలలో నాగార్జున సాగరం వద్ద సమావేశమవుతారట.

జిల్లాబోర్డులను రద్దు చేసినంత మాత్రాన ప్రభుత్వానికి చెప్పుకో తగ్గంత ఖర్చేమీ కలిసిరాదు. జిల్లాబోర్డులను రద్దుచేసి-ఇప్పుడు అవి నిర్వర్తిస్తున్న బాధ్యతలను ప్రభుత్వమే తీసుకుంటే బోర్డుల అధీనంలో పనిచేస్తున్న ఉపాధ్యాయులకూ, ఇతర ఉద్యోగులకూ ప్రభుత్వం ఇచ్చేపద్ధతిలో వేతనాలను ఇవ్వవలసి వస్తుంది;అది అదనపు ఖర్చు.

### పటిష్ఠం చెయ్యాలి

అంతకంటే జిల్లా ప్రణాళికల సంఘాల పనులనూ, అభివృద్ధిపనుల బాధ్యతలనూ ఒప్పజెప్పి జిల్లాబోర్డులను మరింత ఉపయోగకరంగా రూపొందించుకుంటే బాగుంటుందని చాలామంది సభ్యులు అన్నారట.

ఆంధ్రప్రాంతంలో వయోజన వోటింగుపద్ధతిలో జిల్లాబోర్డులకు ఎన్నికలుజరుగుతవి. తెలంగాణా ప్రాంతంలో కూడా ఇకముందు అదేపద్ధతిలో జిల్లా బోర్డులకు ఎన్నికలు జరుగుతవి.

### రద్దు చేయవద్దు

జిల్లాబోర్డులను రద్దు చేయడానికి గానీ, డిసెంబరు 10 వ తేదీ తరువాత కూడా వాటిని ప్రత్యేకాధికారుల అధీనంలో ఉంచడానికికానీ సభ్యులలో చాలామంది సుముఖంగాలేరని తెలుస్తోంది.

### ఒకేరకం పన్నులు

ఆంధ్రప్రదేశ్ అంతటా ఒకేరకం పన్నులవిధానం అవసరమని సభ్యులు అభిప్రాయపడ్డారు. తెలంగాణాలో కంటే ఆంధ్రప్రాంతంలో మోటారు బళ్లపై పన్ను 14 రెట్లు ఎక్కువ. ఆంధ్రప్రాంతంలోని పన్నునే తెలంగాణా ప్రాంతానికికూడా వర్తింపచెయ్యాలని సభ్యులు సూచించారని తెలుస్తోంది. అట్లా ఈ పన్నును తెలంగాణాకు వర్తింపచేయడంలోగల బాధకష్టాల వివరాలను ముఖ్యమంత్రీ, అర్థికమంత్రీ పరిశీలించాలి.

తెలంగాణాలో కొన్నిచోట్ల నీటి తీరువ చాలాఎక్కువగా ఉన్నది. ఉభయప్రాంతాలలోనూ ఒకేవిధంగా నీటితీరువ వసూలుచెయ్యాలన్న నిర్ణయంప్రకారం తెలంగాణాలో ఇప్పటి నీటితీరువను సబబయిన స్థాయికి తగ్గించవలసిందిగాకూడా సభ్యులు సూచించారు. శ్రీ గోపాలరెడ్డికూడా దీనికి వ్యతిరేకులు కారట.

### భూమ్యాదాయంపై పన్ను

ఆంధ్రప్రాంతంలోకూడా భూమ్యాదాయంపై పన్నువిధించాలనే ప్రతిపాదనను సభ్యులలో ఎక్కువమంది అనుకూలంగా లేరట. చెరుకు, వేరుసెనగ, పొగాకువంటి వాణిజ్య పంటలపై మాత్రమే ఇంకా ఎక్కువపన్నులు విధించడం సమంజసమని సభ్యులు అభిప్రాయపడ్డారని తెలుస్తోంది.

ఆహారధాన్యాలధరల ప్రసక్తి ఈసమావేశంలో రాలేదు. కానీ,"ఇంకా ఎక్కువ ధర కావాలి" అని వ్యవసాయశాఖ మంత్రి శ్రీ తిమ్మారెడ్డి అవలంబిస్తున్న వైఖరిపట్లమాత్రం కాంగ్రెసు వాదులలోనే అసంతృప్తిఉన్నదని తెలుస్తోంది. అంతత్వరలోనేగాకపోయినా, కొన్నాళ్లలో ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు చర్చకు ఈసమస్యరాగలదని తెలుస్తోంది.

## ద్వితీయ నౌకానిర్మాణ కేంద్ర స్థాపన

### సహాయం చేయడానికి ఒకదేశం సూచన

న్యూఢిల్లీ, జూలై 29: భారతదేశంలో రెండవ నౌకా నిర్మాణ కేంద్రం స్థాపించే నిమిత్తం పెట్టుబడి పెట్టడానికి సమ్మతిస్తూన్నట్లు ఒకదేశం సూచించినదని కమ్యూనికేషన్స్ శాఖామంత్రి శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి ఈరోజున లోక్ సభలో చెప్పారు. అయితే ఆదేశంలో రాయబారులుఇంకా ప్రాథమికదశలో ఉన్న కారణంచేత ఆ దేశం పేరు చెప్పడానికి ఆయన నిరాకరించారు.

రెండవ నౌకానిర్మాణకేంద్ర స్థాపన విషయంలో ఒకటి రెండు దేశాలు కొన్ని ప్రతిపాదనలు చేసినవి. కాని అవి ఇంకా స్పష్టమైన రూపం దాల్చలేదనికూడా శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి అన్నారు.

అంతకుముందు శ్రీ హెడా, మరి 12 మంది సభ్యులు వేసిన ప్రశ్నకు సమాధానం చెప్పుతూ, కొలంబో ప్రణాళికక్రింద భారతదేశానికి వచ్చిన నిపుణుల మొదటి జట్టు దేశంలో కొన్ని ప్రదేశాలు దర్శించారని నిపుణులవర్గం వారు అందరు పరిశీలించడానికిగాను వారు వివరాలు సేకరిస్తూన్నారనిమంత్రి శ్రీ రాజ్ బహదూర్ వివరించారు. తక్కిన్న నిపుణులు సెప్టెంబరులో ఈదేశానికి వస్తారు.

ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో పేర్కొన్న విధంగా భారతప్రభుత్వం రెండవ నౌకా నిర్మాణకేంద్రం స్థాపించడానికిగాను స్థలం ఎన్నుకోవడము సాంకేతికపనివారికి శిక్షణగరపడము చేయగలదనికూడా శ్రీ రాజ్ బహదూర్ అన్నారు. స్థలం ఎన్నిక విషయమై ప్రభుత్వం ఇంకా ఎట్టి తాత్కాలిక నిర్ణయము జరుపలేదని ఆయనచెప్పారు.

## ఆంధ్రలో చెదురుగా వర్షం

మద్రాసు, జూలై 30: తెలంగాణా, కోస్తాలలో చెదురుగాను, రాయలసీమలో కొద్దిగాను వర్షించినది. కడప, ఒంగోలు లందు చెరి 5 సెంటిమీటర్ల వర్షం కురిసినది. రాబోవు 36 గంటలలోగా ఉత్తర కోస్తాలోను, తెలంగాణా ఉత్తర ప్రాంతాలలోను కొన్నిచోట్ల భారీ వర్షాలు కురిసేసూచన ఉన్నది.

## 'ఆహార ఉత్పత్తి పెరగలేదు'

### లోక్ సభలో విమర్శ

న్యూఢిల్లీ, జూలై 29: ఆహార వ్యవసాయ శాఖకు మొత్తం 188 కోట్ల రూపాయలు మంజూరు చేయమని కోరుతూ ప్రవేశపెట్టిన పద్దులపై లోక్ సభలో ప్రారంభమైనచర్చ ఈ రోజున సమాప్తం కాలేదు.

ప్రభుత్వం చాల చర్యలు జరిపినా దేశంలో ఆహార ధాన్యాల ఉత్పత్తి ఇంతవరకు 1953-54 స్థాయికి కూడా పెరుగక పోవడం శోచనీయంగా ఉన్నదని, అమెరికా సంయుక్త రాష్ట్రాల నుంచి, బర్మానుంచి ఆహార ధాన్యాల దిగుమతి ఇంకా సాగుతూనే ఉన్నదని డాక్టర్ రామ్ సుభాగ్ సింగ్ (కాం-బీహార్) చెప్పారు.

ఆహార వ్యవసాయశాఖ కార్యకలాపాలకు, నదీలోయ ప్రాజెక్టులపై అధికారం కలిగిన నీటి పారుదల విద్యుచ్ఛక్తిశాఖ కార్యకలాపాలకు పొంతనం లేదనికూడా డాక్టర్ సింగ్ అన్నారు. కాలువ త్రవ్వకంలోను, నీటి సరఫరాలోను, విద్యుచ్ఛక్తి సరఫరాలోను అలస్యాలు జరుగుతున్నవి. అధికంగా ఉత్పత్తి చేయడానికి వ్యవసాయ దారులకు మేలు విత్తనాలు, రసాయనిక ఎరువులు లభ్యం కావడంలేదు.

కోరలు పూర్తికాగానే ప్రభుత్వం సరసమైన ధరలకు వ్యవసాయదారుల వద్ద అహార ధాన్యాలు కొన్నట్లయితే ధరల పెరుగుదల నిరోధించడం సాధ్యమని శ్రీ ఎస్. వి. పాటిల్ కర్ (కమ్యూ-బొంబాయి) సూచించారు. అక్కడు ప్రభుత్వం వద్ద ఆహార ధాన్యాలు తగినంతగా నిలవ వుంటవి. ఆహార ధాన్యాలు దాచడానికి కూడా ఆస్కారం ఉండదు.

భూమి దున్నడానికి బాగ్యమైన ఎద్దులు లభించేటట్లు చేయడం చాల ముఖ్యమని సేఠ్ గోవింద్ దాస్ (కాం-మధ్యప్రదేశ్) చెప్పారు. గోవధ నిషేధిస్తే తప్ప గోసదనాల కార్యక్రమాలు సఫలం కానేరవు. పశువుల రక్షణకు చట్టబద్ధమైన సంఘ నియామకం అవశ్యకమని కూడా ఆయన సూచించారు.

ఆహారధాన్యాల ధరలు పరిశీలించడానికి నియుక్తమైన అశోక మెహతా సంఘంలో వ్యవసాయదారుల ప్రతినిధిని సభ్యుడుగా నియమించవలసినదని శ్రీ టి. ఎన్. విశ్వనాథరెడ్డి (కాం-ఆంధ్ర) కోరారు. ఆహార శాఖామంత్రి శ్రీ ఎ. పి. జెయిన్ అడ్డువచ్చి ఆసంఘంలో వ్యవసాయదారుల ప్రతినిధి ఉన్నారని చెప్పారు.

అశోక మెహతా సంఘం విడుదల చేసిన ప్రశ్నావళి పరిశీలించగా తిరిగి కంట్రోల్సు ప్రవేశపెట్టడం ఆ సంఘం లక్ష్యమైనట్లుగా గోచరిస్తున్నదని శ్రీ పురుషోత్తమ్‌దాస్ ఆర్. పటేల్ (స్వ-బొంబాయి) అన్నారు. తిరిగి కంట్రోల్సు ప్రవేశపెట్టాలని వ్యవసాయదారులు కోరడం లేదు. అహార ధాన్యాల ధరలు నిర్ణయించడంలో వాటి ఉత్పత్తికి అయ్యే వ్యయం, వ్యవసాయదారుల నికర అదాయము లెక్కకు తీసుకోవాలని ఆయన విజ్ఞప్తి చేశారు.

భూదాన ఉద్యమంక్రింద భూమి లభించినవారికి ప్రభుత్వం నీటిపారుదల సౌకర్యాలుకల్పించకపోతే ఆ ఉద్యమం విఫలంఅవుతుందని శ్రీమతి సంగం లక్ష్మీబాయి (కాం-ఆంధ్ర) చెప్పారు.

తరువాతిలోక్ సభ సమావేశం మంగళవారం వరకు వాయిదా పడినది.

## బియ్యం మిల్లులు పెట్టే నిబంధనలు

### తొలగించాలని నిర్ణయం

హైదరాబాదు, జూలై 29: రాష్ట్రంలో బియ్యం మిల్లులను ఏర్పాటుచేసే సందర్భంలో ఇంతవరకూ ఉంటున్న నిబంధనలను తొలగించాలని ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం నిర్ణయించింది. దంపుడు బియ్యం పరిశ్రమను ప్రోత్సహించేందుకని 1955 లో ప్రభుత్వం ఈ నిబంధనలను అమలు జరిపించింది.

ఇప్పటి నిర్ణయం ప్రకారం కలెక్టరూ ఆరోగ్యశాఖాధికారుల అనుమతితో బియ్యం మిల్లులను నెలకొల్పవచ్చు.

ధాన్యం పుష్కలంగా సప్లయిఅయ్యే ప్రాంతాలలో కొత్తగా బియ్యం మిల్లులను ఏర్పాటుచెయ్యడానికి అనుమతులను ఇవ్వాలని కూడా ప్రభుత్వం నిర్ణయించింది.

## ఆత్మకూరు ప్రాంతంలో చెరువుల మరమ్మతు

### ప్రభుత్వ నిర్ణయం

ఆత్మకూరు, జూలై 25: ఆత్మకూరు సబ్ తాలూకా ప్రజలకు బాగా వినియోగపడే కొన్ని చెరువులను బాగు చేయించాలని నీటి పారుదల సౌకర్యాల శాఖ నిర్ణయించింది. కురుకుంద చెరువుకు రు 4,200, కొత్తపల్లె చెరువుకు రు 6,500, ఇందిరేశ్వరం చెరువుకు రు 4 వేలూ ఇచ్చించి బాగుచేయించాలని నిర్ణయించారు.

# అంతర్జాతీయ అణుశక్తి వ్యవస్థ

## ఒప్పందంమీద అమెరికాఅధ్యక్షునిసంతకం

వాషింగ్టన్, జులై 29: అంతర్జాతీయ అణుశక్తి వ్యవస్థ ఒప్పందంలో అమెరికాను చేరుస్తూ, దేశాధ్యక్షుడు శ్రీ ఐసెన్ హోవర్ అందుకు సంబంధించిన ఒప్పందంమీద సంతకంచేశారు; దీనితో, ఈ వ్యవస్థ నేటినుంచి అమలులో స్థితిని పొందింది అవుతోంది.

ప్రపంచంలో అణుశక్తిరాజ్యాలు మూడు పెద్దరాజ్యాలు వున్నాయి. ఈ మూడురాజ్యాలు ఆమోదిస్తేనేగాని, ఈ ఒప్పందం అమలులోకివచ్చినట్లు కాదు. ఇంతవరకు బ్రిటన్, రష్యాలు, ఈ ఒప్పందాన్ని ఆమోదించాయి. అమెరికా తాత్సారంచేస్తూవచ్చి, ఇప్పుడు ఆమోదించింది. దీనితో 80 రాజ్యాలకు సభ్యత్వంవున్న అంతర్జాతీయ అణుశక్తివ్యవస్థ అమలులో స్థితిని పొందుతోంది.

1953 లో అమెరికా అధ్యక్షుడు "శాంతికి అణుశక్తి" సూచనలుచేసిన అనంతరం, ఈ వ్యవస్థ స్థాపననుగూర్చిన ఆలోచనలు ప్రారంభమైనాయి. ఆతర్వాత 80 రాజ్యాలలో ఈ వ్యవస్థ ఏర్పాటుచెయ్యడానికి ఒప్పందం, కుదిరింది. ఇప్పుడు అది అమలులోకి వచ్చింది. అధికారికంగా వ్యవస్థ ఈ సంవత్సరంలోగా ఎప్పుడో అవతరిస్తుంది.

# కాశ్మీర్ సమస్య

## చైనాతో పాక్ ఉత్తర ప్రత్యుత్తరాలు

కరాచీ, జులై 29: కాశ్మీర్ సమస్యను గురించి చైనా మద్దతును సాధించడం కోసం ఆదేశంతో పాక్ ప్రభుత్వం ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతోందని పాక్ విదేశాంగశాఖ ఉద్యోగులు నేడు వెల్లడిచేశారు.

"ఈ సమస్యలో పాకిస్తాన్ను చైనా తదితర స్నేహిత రాజ్యాలు బలపరుస్తాయనే అనుకుంటున్నాము" అని గూడా ఆ అధికారులు అంటున్నారు.

# ట్యునీషియాలో కొత్త ప్రభుత్వం

ట్యూనిస్, జులై 29: ట్యునీషియా అధ్యక్షుడు దేశంలో కొత్త ప్రభుత్వాన్ని ఏర్పాటుచేసినట్లు నేడు అధికారికంగా ఒక ప్రకటన వెలువడింది.

ట్యునీషియాలో రాజరికాన్ని రద్దుచేసి, అప్పటివరకు ప్రధానమంత్రిగా వున్న శ్రీ హబీబ్ బూర్గ్యూబా, దేశాధ్యక్షులైనారు. ఆ అనంతరం ఆ పాత ప్రభుత్వం రాజీనామా ఇచ్చింది. ఇప్పుడు, ఈ కొత్త ప్రభుత్వాన్ని, దేశాధ్యక్షుడు శ్రీ బూర్గ్యూబా ఏర్పాటు చేశారు. ఇందులో 12 గురు కార్యదర్శులు (మంత్రులు), ముగ్గురు ఉపకార్యదర్శులు వుంటారు.

## కావలి పంచాయతీ

కావలి, జులై 26: కావలి పంచాయితీబోర్డు అధ్యక్షుడుగా శ్రీ సోమిరెడ్డి అయ్యపరెడ్డి ఎన్నికయినారు.



# బ్రిటిష్ సైనికదళంచే బురైమీ ఆక్రమణ

## మరో ఒమాన్ కోటపై విమానాల దాడి

మస్కాట్, జూలై 29: సౌదీ అరేబియా - ఒమాన్ సరిహద్దులలో పెట్రోల్ గనుల మయమైన ప్రాంతం, బురైమీ ఒయసిస్లోకి ఇవాళ బ్రిటిష్ కామరోనియన్ సైనికదళం ప్రవేశించింది.

కేంద్ర ఒమాన్ ప్రాంతంపై రాయల్ (బ్రిటిష్) విమానాలు ఇవాళ తిరిగి దాడులు ప్రారంభించాయి.

బురైమీ ఒయసిస్ ఒమాన్ కేంద్ర ప్రాంతానికి వాయవ్యదిశలో 150 మైళ్ళ దూరంలో ఉంది. గనులలో అపారంగా పెట్రోల్ లభ్యమయ్యే ప్రాంతం ఇది.

ఈ ప్రాంతం గురించి చిరకాలంగా మస్కాట్ సుల్తాన్ సౌదీఅరేబియాల మధ్య తగవు సాగుతోంది. 1955 లో ఈ ప్రాంతాన్ని సౌదీఅరేబియా సైనికదళం వద్దనుంచి బ్రిటిషు అధికారులు లాక్కున్నారు. ఆ తరవాత ఒమాన్ ప్రాంతానికి చెందినవారు సుమారు వెయ్యిమందితో ఒక సైనికదళం నిర్మించి, బ్రిటిషు సైనికోద్యోగుల అధికారంలో ఆ దళం సహాయంతో ఆ ప్రాంతాన్ని బ్రిటన్ మస్కాట్ సుల్తాన్ పేర తన అధీనంలో ఉంచుకుంది.

ఒమాన్ తిరుగుబాటు ప్రారంభమైన తరువాత, బురైమీలోని ఒమానీ సైనికులు తిరుగుబాటు చేశారనీ, ఈ తిరుగుబాటును అణచడానికి బ్రిటిషు సైనికదళాన్ని పంపవలసి వచ్చిందనీ ఇటీవల కొన్ని పత్రికలు వార్తలు ప్రచురించాయి. ఈ వార్తలు నిజం కావని బ్రిటిషు విదేశాంగ కార్యాలయం ప్రకటించింది.

అయితే, ఒమానీ సైనికదళాన్ని బురైమీ ఒయసిస్లో కేంద్రీకరించినట్లు ఇవాళ బ్రిటిషు విదేశాంగశాఖాధికారి తెలిపారు.

ఒమానీ సైనికదళం కార్యాలయం మస్కాట్లో ఉంది.

## గంటన్నరసేపు పది విమానాల దాడి

మస్కాట్, జూలై 29: రాయల్ విమానదళానికి చెందిన పది జెట్ విమానాలు ఇవాళ, ఇజ్కీకి తూర్పున 8 మైళ్ళలో ఉన్న బిర్కాట్ కోటపై దాడిచేసి, రాకెట్లు మరఫిరంగులు ప్రయోగించాయి. దాడి గంటన్నరసేపు జరిగింది.

అంటే నిజ్వా, ఇజ్కీ, తానుఫ్ కోటలపై మొదట జరిగిన దాడికంటె, ఇవాళ బిర్కాట్ కోటపై దాడి రెట్టింపు ఉధృతంగా జరిగిందన్నమాట.

ఇదివరలో మూడుసార్లు బిర్కాట్ కోటపై దాడికి 48 గంటల ముందు ఒక విమానం కరపత్రాలు జారవిడిచి కోటలోని వారిని హెచ్చరించింది.

ఇవాళ దాడిలో బిర్కాట్ కోట గోడలు కొంతమేర పడగొట్టారని రాయల్ విమానదళ అధికారి ఒకరు చెప్పారు.

కోటలో కాని కోటకు అర్ధమైలులో ఉన్న రెండు గ్రామాలలో కాని జనసంచారం కనపడలేదట. అయితే నిజ్వాకు 12 మైళ్ళ పశ్చిమాన బక్లాల్ అనే ఒక కోటపైన ఇమాం తెల్లపతాక కనపడింది. రేపు ఈకోటపై దాడి జరిగితే జరగవచ్చు.

దాడిచేసిన ఈ విమానాలలో నాలుగు ఏడెన్ నుంచీ, ఆరు కెన్యా నుంచీ వచ్చాయని కొందరు విలేఖరులు చెపుతున్నారు.

బ్రిటిష్ సంరక్షణలో ఉన్న పొరుగు రాజ్యాల నుంచి సైన్యాలు కదిలి ఒమాన్ దిశగా వెడుతున్నాయని, ధ్రువపడని వార్తలు కొన్ని వస్తున్నాయి.

నిజ్వావద్ద కేంద్రీకృతమైన తిరుగుబాటుదార్ల స్థితి ఎలావుందో కనిపెట్టడానికి, మస్కాట్ సుల్తాన్ ఒక ఒమాన్ జాతినాయకుని పంపుతున్నారని, నిన్న రాత్రి, బ్రిటిష్ రాజకీయ ప్రతినిధి సర్ బెర్నార్డు బరోస్ తెలియ పరిచారు.

ఒమాన్ తిరుగుబాటుదార్ల అధీనంలో ఉన్న ప్రాంతం చుట్టూ, బ్రిటిష్ అధీనంలోని సైన్యాలు కంచె కట్టి ముందు ముందుకు పోతున్నాయనీ, అయితే, ఇంతవరకూ ఈ సైన్యాలు తిరుగుబాటుదార్ల దాపులోకి పోలేదనీ కూడా శ్రీ బరోస్ చెప్పారు.

## చైనా సహాయం ఇస్తానన లేదు

కైరో, జూలై 29: కైరోలోని ఇమాం ప్రతినిధికి టెలిఫోన్ చేసి, కమ్యూనిస్టు చైనా సహాయం చేస్తుందని తమ కార్యాలయం నుంచి ఎవరూ చెప్పనేలేదని, చైనా రాయబార కార్యాలయాధికారి ఒకరు ఇవాళ ప్రకటించారు.

ఇమాం ప్రతినిధి శ్రీ మహమూద్ ఎల్ నాశిబీ నిన్న తనుకే స్వయంగా చైనా రాయబార కార్యాలయం నుంచి టెలిఫోన్ చేసి చెప్పారని నిన్న పత్రికా సమావేశంలో అన్నారు.

చైనా రాయబార కార్యాలయం ఇది నిజంకాదని ఇవాళ చేసిన ప్రకటనను తెలియచేసి, విలేఖరులు శ్రీ నాశిబీని ప్రశ్నించగా, ప్రస్తుతం ఏమీ చెప్పలేరని వారు జవాబిచ్చారు.

## యెమెన్ స్థావరంపై బ్రిటిష్ విమానదాడి

లండన్, జూలై 29: అయినకోటలు క్రిందట యెమెన్కు చెందిన హారీబ్ ప్రాంతంపై ఒక బ్రిటిష్ విమానం 88 గిందనీ, ముకైర స్థావరంపై నాలుగు జెట్ విమానాలు దాడిచేశాయనీ, ఇది పచ్చి దురాక్రమణ అనీ, లండన్లోని యెమెన్ లిగేషన్ బ్రిటిష్ ప్రభుత్వానికి నిరసన ప్రకటించింది.

ముకైర స్థావరంపై బ్రిటిష్ జెట్ విమానాలు రాకెట్లు, మరఫిరంగులు ప్రయోగించాయని యెమెన్ ఆరోపించింది. విమానాలదాడి సుమారు మూడు గంటలసేపు జరిగిందిట.

యెమెన్ నిరసనను నిరాకరిస్తూ, ముకైర ప్రాంతం ఏడెన్కు చెందినదని బ్రిటిష్ విదేశాంగ కార్యాలయం జవాబిచ్చింది. ఇంక హారీబ్ ప్రాంతంపై ఒక విమానం తిరిగిందనే అంశం పరిశీలించగలరని వాగ్దాన మిచ్చింది.

## దక్షత రాలేదు

(1 వ పేజీ తరువాయి)

రామా రెడ్డి, శ్రీ జె. కొండలరావు, శ్రీమతి శాంతాబాయికూడా చర్చలో పాల్గొన్నారు.

తెలంగాణాలో చిన్ననీటి వనర్లు, గ్రామీణ విద్యుచ్ఛక్తి సరఫరా పథకాలకు అధిక ప్రాముఖ్య మివ్వాలని శ్రీ బాగారెడ్డి కోరారు.

శ్రీ పి. నరసింగరావు వ్యవసాయ కూలీలకు కనీస వేతనాలు అమలు జరిపితే ఎక్కువమంది కాయకష్టం చేయడానికి ఉత్సాహపడగలరని చెప్పారు.

చర్చకు సమాధానమిస్తూ మంత్రి ఇలా అన్నారు.

"ప్రతి కేంద్రానికి కేటాయించిన డబ్బులో అధికభాగం సిబ్బంది వేతనాలకు వగైరాలకు ఖర్చవుతోందనడం నిజంకాదు. ప్రతి కేంద్రానికి ఇచ్చే రు 1 లక్ష మాత్రమే ప్రధాన కార్యక్రమం క్రింద ఖర్చవుతుంది. ఇందులో అధికభాగం వేతనాల క్రిందనే పోయినా, యీ వికాస కార్యక్రమం వ్యక్తుల ద్వారా నిపుణుల ద్వారా జరుగుతుంది. రాళ్లతోను, బండలతోను, కాదని గుర్తించాలి. సుశిక్షితులయిన కార్యకర్తలను నియమించకపోతే, పనులు ఎలా జరుగుతాయి? వీరి వేతనాలు హెచ్చు అనడంకూడా సబబుకాదు. ఇక్కడ ఇంకొక ముఖ్యవిషయంకూడా గమనించాలి. ఈ కార్యక్రమం అసలు వుద్దేశం ఇప్పుడు గ్రామాలలో జరుగుతున్న మానవకృషిని ఇంకా విస్తరింపజేయడమేగాని కొత్తవనరులను సృష్టించడం కాదు."

"రెవిన్యూ అధికారులకు పని నప్పగించడం శావృద్ధం కాదు. గ్రామాలలో మారుమూలప్రాంతాలలో జరగాల్సిన యీ కార్యక్రమంపట్ల ప్రత్యేకమైన ఆసక్తితో పనిచేయాలని ముందుకు వచ్చే అధికారులసంఖ్య చాలా తక్కువయినందువనే రెవిన్యూ వుద్యోగులకు కూడా యీ బాధ్యతలు ఇవ్వాల్సి వచ్చింది."

"జిల్లా ప్రణాళికా సంఘాలు కేంద్రాల అధికారులు సరిగా పనిచేయడంలేదని ఇక్కడ విమర్శించటం సులభమే. కాని వారు పనిచేయకపోతే బాధ్యులెవరో ఏంచేయాలో ఎవరూ చెప్పడంలేదు. కొందరు గ్రామాలలో రోడ్లు, రేడియోలు వద్దంటున్నారు. చెరువుల మరమ్మతులు, పాఠశాలలు, రేడియోలు, అన్నీ అవసరమే. ఇంజనీరింగు సిబ్బంది తగినంత లేనందున ముఖ్యంగా తెలంగాణాలో రోడ్లు, చెరువుల, మరమ్మతుల పనులు ఆలస్యమవుతున్నాయి. ఈ విషయమై తగు చర్యలు తీసుకుంటాం."

"జిల్లా ప్రణాళికా సంఘాలలోను, బ్లాక్ సలహాసంఘాలలోను కాంగ్రెసేతర పక్షాలకు కూడా తగుస్థానం ఇస్తున్నాం, కొర్లను, జీపులను, అధికారులు స్వంతానికి వాడుకుంటున్నారని విమర్శించేవారు సంఘ సమావేశాలలో యీ విషయం చర్చించరేమి? పోనీ ప్రభుత్వదృష్టికి కొన్ని తీసుకురండి. దేశానికి మేలుజరుగుతుంది."

"సాంఘిక విద్యా ప్రచారకులు సాధారణంగా స్త్రీలు. వీరిని పక్షులు విమర్శించడం సమంజసంకాదు. ఈ రోజులలో కూడా గ్రామాలలోకి వెళ్ళి నిర్మాణాత్మకమైన కృషి చేయడానికి ముందుకువచ్చే యువకుల సంఖ్య చాలా తక్కువ. వీరిని అన్నివిధాలా ప్రోత్సహించాలి."

"స్థానికాభివృద్ధి పనులు వెనుకబడిన ప్రాంతాలలోని వికాసకేంద్రాలు లేని చోట్లనే జరుపుతున్నాం. ప్రతిజ్ఞాపకు రెండు బుల్ డోజర్లు, రెండు ట్రాక్టర్లు ఇవ్వాలని సికరు సూచించారు. నిరుద్యోగం అధికంగావున్న యీ దేశంలో యీ యంత్రాల వాడకం వాంఛనీయం కాదు. పైగా కేటి నిర్వహణకు పెట్టే యంత్రభాగాల సేకరణకు వ్యయం కూడా చాలా అవుతుంది."

## నెహ్రూ హెచ్చరిక

(1 వ పుట తరువాయి)

కార్మికులకుమాత్రమే అది సంబంధించిన విషయం. ప్రజావసరం నిత్యం తీర్చేసంస్థల విషయంలో అది సమాజానికి కూడా సంబంధించినదే అవుతుంది. దీనిని మిగతా సమ్మెలవంటి వానితో సమానం అనుకోకూడదు.

ప్రభుత్వం అనగానే వివేకం గుత్త తీసుకున్నది అని కాదు. సమాలోచన సంప్రదింపులతో అవసరం లేకుండా అన్ని నిర్ణయాలూ స్వయంగా చేసెయ్యగలదని ప్రభుత్వం భావిస్తే, అది పొరపాటే అవుతుంది.

ప్రభుత్వం అంటే ప్రజాస్వామ్య వ్యవస్థలో ప్రజాభిప్రాయానికి ప్రతిబింబం అనుకోవాలి, ప్రజాభిమతానికి అది దర్పణం. అదికానప్పుడు ఆ ప్రభుత్వం ప్రజలకు దూరమైపోతుంది.

భారతదేశం ఇప్పుడు పెద్ద చిక్కులలో ఉంది. అవసరవస్తు సామగ్రి ధరలు పెరిగిపోయాయి. ధరలు పెరిగినప్పుడు ప్రజలందరూ బాధపడతారు. ఈసమస్యలను శ్రద్ధగా పరిశీలించి ప్రజల భారం తొలగించాలి. ప్రజలు బాధలు, పడుతున్నారని తెలుసు. కాని అవి నివారించే ఇంద్రజాలం ఏదీ లేదు. పొరపాట్లు అందరివల్లా జరుగుతాయి. కాని ఒక పొరపాటు సరిదిద్దడానికి మరో పెద్ద పొరపాటుకు దిగకూడదు.

### మనిషికీ మృగానికీ తేడా; చేతి పరికరం

మనుష్యులకూ మృగాలకూ తేడా ఏమిటంటే, మనిషి, చేతి పరికరాలు తయారుచేసుకునే మృగం.

చక్రాన్ని కనిపెట్టినప్పుడు, నిప్పు కనిపెట్టినప్పుడు మనిషి విప్లవాలు సాధించాడు. విప్లవాత్మకమైన అభ్యుదయం సాధించాడు. పరికరం అనేది మనిషి క్రియాశక్తి అభివృద్ధికి చిహ్నం.

ఏ దేశం, ఏ సమాజం స్థితి తెలుసుకోవాలన్నా, ఆదేశం లేక ఆ సమాజం ఉపయోగించే పరికరాలే సాధనం.

పరికరాలనేవి మంచికీ వినియోగించవచ్చు; కీడుకీ పనికిరావచ్చు. ఉపయోగించే మనిషినిబట్టి పరికరం మంచిదో చెడ్డదో అవుతుంది. అణుశక్తి మానవాభ్యుదయానికీ ఉపయోగ పడుతుంది, నాశనం చెయ్యడానికీ పనికివస్తుంది.

దేశం సంపద బంగారం వెండి మొదలైన వానిలో కంటె, పరికరాలు ఉపయోగించగల నిపుణులనుబట్టి లెక్కకట్టుకోడం మంచిది. దేశం అభ్యుదయాన్ని సాంకేతిక నిపుణుల సంఖ్యనుబట్టి తెలుసుకోవాలి.

### ఖాళీలున్నాయి, నిరుద్యోగులూ ఉన్నారు

భారతదేశంలో ప్రస్తుతం ముప్పై మూడువేలమంది ఇంజనీర్లు ఉన్నారు. దేశానికి వీరు బొత్తిగా చాలరు. కాని చిత్రం ఏమిటంటే, ఉద్యోగం దొరక్క ఉండిపోయిన ఇంజనీర్లు ఉన్నారు. అంటే దేశవ్యవహారాలు నడపడంలో ఏదో లోపం ఉందన్నమాట.

వృత్తి విద్యాశిక్షణ జాతీయమండలి ఈ సమస్యను పరిష్కరించడానికి శిక్షణ ఇచ్చే ప్రతి వ్యక్తీ, దేశంలో ఉత్పత్తి పరిశ్రమలకు ఉపయోగపడే విధంగా కార్య విధానం నిర్ణయించుకుంది. అందుకు ఆ మండలిని శ్రీ నెహ్రూ అభినందించారు.

స్తంభించిపోయిన ఆర్థిక వ్యవస్థను, అవరోధాలు గడిచి చలనం పుట్టించి అభ్యుదయాత్మకమైనదిగా రూపొందించాలని మన దేశంలో కృషి జరుగుతోంది. ఇది చాలా కష్టమైన ఘట్టం. ప్రసవవేదనలో వలె ఈ యాతనలు ఇంకా కొంతకాలం తప్పవు.

ఇటువంటి సమయంలో దేశానికి అత్యవసరమైనది సాంకేతిక నిపుణుల బలగం. దేశాభివృద్ధి సాంకేతికాభివృద్ధిపైనే ఆధారపడి ఉంది. అయితే ఈ అభివృద్ధి సామాజిక పరిణామాలతో సమన్వయం కావాలి. మంచి తక్కువైన దేశాలలో సాంకేతిక పరికరాలపైనే ఆధారపడవచ్చు. కాని జనం అపారంగా ఉన్న దేశంలో రెండు పద్ధతులమధ్య సమన్వయం అవసరం.

దేశం అభ్యుదయం, వ్యక్తుల మధ్య వర్గాలమధ్యసహకారభావంఅలవడ్డంపై కూడా ఆధారపడి ఉంటుంది. సాంకేతికాభివృద్ధి సాధిస్తున్నకొద్దీ మనుష్యుల మధ్య సహకారవిధానం అలవడ్డం అవసరం. ఏకరాజ్యం, ఏకదేశం అనే భావాలు ఈ సహకారతత్వంపై ఆధారపడి ఉన్నాయి.

కాని ఇదంతానిజమే అనుకుంటూనే విరుద్ధంగా చాలామంది తరుచు వ్యవహరిస్తున్నారు. దేశంలో నానాటికి పెరిగిపోతున్న ఈ విచ్ఛిన్నతత్వం చూస్తే చాలా కలవరం కలుగుతోంది, అని శ్రీ నెహ్రూ అన్నారు.

### నేను మధ్యతరగతికి చెందినవాడిని - నెహ్రూ

సమ్మెలగురించి ప్రసంగించిన సందర్భంలో శ్రీ నెహ్రూ ఇలా అన్నారు.

"నేను కర్షకుడినీ కాను, కర్మాగారంలో కార్మికుడినీ కాను. కేవలం మధ్యతరగతి మనిషిని. అందువల్లనే కర్షకులు కార్మికుల మనస్సులు నాకు బోధపడ్డం లేదనుకుంటాను."

అయితే ఎవ్వరినీ నిరసించడం లేదని చెప్పారు. పారిశ్రామిక సంఘర్షణ మాత్రం దేశానికి హానికరం అనివార్యం గ్రహించాలి, అన్నారు.

"ఇవి గడ్డుకాలం అన్న సంగతి మనం గుర్తించాము. ధరలు కొంతవరకు పెరిగినమాట వాస్తవం. కాని అదృష్టవశాత్తు, యివి చాలా దేశాల్లో వాటి కంటె తక్కువే. వస్తువుల ధరలు, ముఖ్యంగా అవసర పదార్థాల ధరలు పెరిగినప్పుడు ప్రజలు యిబ్బంది పడతారు. ఈ సమస్యను శ్రద్ధగా పరిశీలించి ప్రజలు ఉద్యోగులపై ఉన్న అత్యధిక భారాలను తొలగించేందుకు ప్రయత్నించటం మన విధి. ఈ విషయాన్ని నేను గుర్తిస్తున్నాను. ప్రజలు కష్టాల్లో ఉన్నారని గూడా గుర్తిస్తున్నాను. మనం యీ విషయాలను పరిశీలిస్తాము. అయితే యీ కష్టాలన్నిటనీ హఠాత్తుగా మాయం చేయటానికి ఎలాంటి ఔషధం లేదన్న అంశాన్ని గూడా మనం గుర్తించాలి. పురోగమన యత్నంలో మనం కొన్ని కష్టాలను ఎదుర్కొంటున్నాము. ఇందులో అక్కడొక తప్పు, యిక్కడొక తప్పుచేసి ఉండవచ్చును. తప్పు చేస్తే ఒప్పుకుంటాము. అందుకు బడాయిపడనక్కర్లేదు. వాటిని దిద్దుకునేందుకు ప్రయత్నిస్తాము. కాని ఒక తప్పును దిద్దుకోవటం అంటే ఇంకొక పెద్ద తప్పును చేయటం వల్ల మాత్రం సాధ్యం కాదు.

దేశంలో సమాజానికి అవసరమైన సమ్మెల్లో సమ్మెలు అని, అవి యినీ అని కొందరు మాట్లాడటం చూస్తూ ఉంటే నాకు ఆశ్చర్యము, బాధ, దుఃఖము గూడా కలుగుతూ ఉంటాయి. వారి కోర్కెలు సవ్యమైనవే కావచ్చు. అయినా ఈ సమ్మెల పద్ధతి మాత్రం సవ్యం అయిందికాదు. ఆలోచనా రహితమైంది. సంగతి సందర్భాలు తెలియనిది సమాజానికి, జాతికీ గూడా విరుద్ధమైనది. వారి కష్టాలను గూర్చి ఆలోచించుకోవచ్చు. యితరుల కష్టాలనుగూర్చి గూడా ఆలోచించుకోవచ్చు. మధ్య బెదిరింపులను వదిలిపెట్టి యీ విషయాలను మాట్లాడుకోవటం మంచిది. సమ్మెదారులదగ్గర సమ్మె అనే ఆయుధం ఉంటే ప్రభుత్వం దగ్గర అంతకంటె పెద్ద ఆయుధాలున్నాయి. అయితే వాటిని ఉపయోగించటం నాకు యిష్టంలేదు. ఆయుధాన్ని ఉపయోగించటం అంటేనే అపజయాన్ని అంగీకరించటం. అదీ నాకు యిష్టంలేదు. ఒకప్పుడు ప్రభుత్వం తమ ఆయుధాలను ఉపయోగించక తప్పని పరిస్థితి ఏర్పడవచ్చు. అయినా అందువల్ల ప్రభుత్వానికి మర్యాద కలగదు, అవతల వారికీ మర్యాదఉండదు. ఇటువంటిసమస్యలను బెదిరింపులతో తేల్చుకోవటం జరిగే పనికాదు. ఇది ముఖ్యమైన సమస్య, తీవ్రమైనది గూడా. దేశంలోను, సంఘంలోను తీవ్రమైన విపరిణామాలను తీసుకువచ్చే సమస్య.

## నందా ప్రసంగము

కేంద్ర కార్మికమంత్రి శ్రీ నందా గూడా ఈ సభలో మాట్లాడారు. ఆయన ఇలా అన్నారు. "వృత్తి శాస్త్ర పాఠాలలో శిక్షణ ఇచ్చేందుకు ఒక జాతీయ పరిషత్తును ఏర్పాటు చేయడం వల్ల, ఇంతకాలం నిరుద్యోగ నివారణకు అడ్డు వస్తున్న, సమోత్పత్తికి అవరోధంగా వుంటున్న, కొన్ని కొన్ని లోట్లను తొలగజెట్టడానికి మార్గం ఏర్పడుతోంది. అభివృద్ధి చెందివున్న దేశాలతో పోల్చిచూస్తే, మన దేశంలో సాంకేతిక వృత్తులలోవున్న వారి నైపుణ్యం మేలురకంగా కన్పించదు. అందువల్ల పనివారికే తగిన ఆదాయం లభించడంలేదు. ఉత్పత్తి పెరగడంలేదు. ఇప్పుడు దేశంలో ఎన్నో కార్యక్రమాలను, అభివృద్ధి కోసం, తలపెట్టాము. వాటినిగూర్చిన పనులు నడుస్తున్నాయి. ఈ పరిస్థితిలో దేశంలో, సిద్ధహస్తులైన పనివారి అవసరం ఎంతైనావుంది. వేలు, లక్షలు, ఇటువంటి పనివారుమనకు కావలసివున్నారు. 10, 15 సంవత్సరాలలో దేశానికి ఇటువంటివారు ఎంతమంది కావలసివస్తారో దాన్ని దృష్టిలో వుంచుకొని ఏసంవత్సరానికి ఆసంవత్సరం, నిపుణుల అవసరం ఎంతో తేల్చుకొని, వ్యవహారం నడుపుకు పోతూవుండటం అన్నది ప్లానింగు పద్ధతిలో ప్రధానధర్మం. ఈ ధర్మాన్ని నిర్వహించడం, ఈ పరిషత్తు ప్రథమ బాధ్యతలలో ఒకటి."

ఈపరిషత్తు స్వరూపాన్ని గూడా శ్రీ నందా ఈసందర్భంలో వివరించారు. ఇందులో కేంద్ర ప్రభుత్వ, రాష్ట్రప్రభుత్వాల ప్రతినిధులు, యజమానుల ప్రతినిధులు కార్మికుల ప్రతినిధులు, విద్యాసంస్థల ప్రతినిధులు వుంటారని చెప్పారు. ఇటువంటి ఈపరిషత్తు వృత్తికారుల శిక్షణకు సంబంధించిన అన్ని కార్యక్రమాలను సంయోజితంచేసి, యీశిక్షణ కార్యానికి ప్రమాణశుద్ధి ఏర్పాటు చేయగలదని తాను ఆశిస్తున్నాము అని చెప్పారు.

## విభూతి లేని సానుభూతి

(1 వ పుట తరువాయి)

మెరుపు వచ్చాం. భారంవహించి నడుస్తున్న వార్లపై సానుభూతి చూపించాలి. డబ్బు కావాలి. ఎక్కడినుంచి వస్తుంది? ఎవరిమీద పన్నులువేయాలి?

"నెలకు వెయ్యిరూపాయల జీతాల ఉద్యోగులు మన రాష్ట్రమంతటిలోనూ కలిసి 75 మంది ఉన్నారు. మనరాష్ట్రంలో మహారాజులు ఎంతమంది ఉన్నారో శ్రీ సుందరయ్యే ఆలోచించి చెబితే బాగుంటుంది. పదిఎకరాల భూమి ఉన్న వాళ్లందరూ మహారాజులు అనుకుంటే తప్ప మనరాష్ట్రంలో మహారాజు లెవరూ లేరు."

"మనకు పరిశ్రమలులేవు. చెప్పుకోతగినంత వాణిజ్యం లేదు. వేరుపట్టణాలు లేవు."

### నిర్వచనం చెప్పండి

"ఇంత డబ్బుంటే ఐశ్వర్యవంతుడని

# 51 గ్రామాల అధికార్ల తాత్కాలిక తొలగింపు

## జమాబంది పనిచెయ్యని ఫలితం

[ఆంధ్ర పత్రిక ప్రతినిధి]

హైదరాబాదు, జూలై 30: జమాబంది పనిచెయ్యడానికి నిరాకరించినందున పశ్చిమ గోదావరిజిల్లాలో 51 గ్రామాల అధికారులను తాత్కాలికంగా ఉద్యోగాలనుంచి తొలగించారని అధికార రీత్యా తెలిసింది. శ్రీకాకుళం కర్నూలు జిల్లాల్లో నిర్ణయించిన ప్రకారం జమాబంది జరుగుతోంది.

గ్రామాధికారుల కోర్కెల విచారణకు ప్రభుత్వం నియమించిన సంఘంత్వరలో పని ప్రారంభిస్తుందని రెవిన్యూమంత్రి శ్రీ కళావెంకటరావు చెప్పారు.

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు

## ఆగస్టు 7న ప్రారంభం

హైదరాబాదు, జూలై 30: ఆంధ్రప్రదేశ్ సాహిత్య పరిషత్తును ఆగస్టు 7 వ తేదీన రాష్ట్రపతి డాక్టరు రాజేంద్ర ప్రసాద్ ప్రారంభోత్సవం చేస్తారు.

పరిషత్తుకు (అకాడమీ) శ్రీ బెజవాడ గోపాలరెడ్డి అధ్యక్షుడుగా ఉంటారు. పరిషత్తుకు 60 మంది సర్వసభ సభ్యులుంటారు; 15 గురు సభ్యుల కార్యవర్గం ఉంటుంది. ప్రారంభోత్సవ సభకు కొత్త గవర్నరు శ్రీ సవార్ అధ్యక్షత వహిస్తారని విద్యాశాఖమంత్రి శ్రీ పట్టాభి రామారావు ఈవేళ ప్రకటించారు.

# విద్యుత్తంత్రాల కర్మాగారం

## జపాను సహాయంతో వర్తక రంగంలో

త్రివేంద్రం, జూలై 28: ఎర్నాకులం దగ్గరగా త్రిప్పునిరుకలో వర్తక రంగంలో విద్యుత్ తంత్రాలు, కేబుల్లు తయారుచేసేందుకు ఒక కర్మాగారాన్ని త్వరలోనే స్థాపించబోతున్నారు. ఇందులో జపాను సహాయంచేస్తోంది.

ఈ కర్మాగారం మొత్తం పెట్టుబడి 60 లక్షలు. అందులో 45% వాటాలు జపాను కొంటుంది; తక్కిన వాటాలు మన దేశంలో వారి పరంగా వుంటాయి.

ఈకర్మాగారం స్థాపన ఒక సంవత్సరంలో పూర్తి అయి, పనిగూడా ప్రారంభం అవుతుంది. ఇందులో దాదాపు 1000 మంది కార్మికులకు ఉద్యోగాలు లభిస్తాయి.

# సురావర్ధీ, మాక్మిలన్ల ఆంతరంగిక చర్చలు

లండన్, జూలై 29: పాకిస్తాన్ ప్రధాని శ్రీ హెచ్. ఎస్. సురావర్ధీ, అమెరికా పర్యటనను ముగించుకొని రాగానే బ్రిటిష్ప్రధాని శ్రీ హెరాల్డ్ మాక్మిలన్ను కలుసుకొని చర్చలు జరిపారు. బ్రిటిష్ ప్రధాని, శ్రీసురావర్ధీకి విందుచేశారు.

మీరు నిర్వచించి నాకు చెప్పండి. మూడుకోట్ల జనాభాలో ఐశ్వర్యవంతులు ఎంతమంది ఉన్నారూ? ఐశ్వర్యవంతులమీద మనం పన్ను విధించకపోయినా కేంద్రప్రభుత్వం విధిస్తూనే ఉన్నది. సంపదపై కేంద్రప్రభుత్వం పన్ను వేస్తే నన్నందుకు చాలా విమర్శలు వచ్చినవి. విమర్శలువచ్చినా, వారు పన్నులు విధిస్తూనే ఉన్నందుకు వారిని మనం అభినందించాలి."

## గ్రామోద్యోగుల సమస్య

"గ్రామోద్యోగులకు ఏమీ చెయ్యలేక పోయినారేంకి పైగా బెదిరిస్తున్నారని అంటున్నారు. బెదిరించేదెవరూ? ఈవారు బెదిరించేది ప్రభుత్వం కాదు. వారే ప్రభుత్వాన్ని బెదరిస్తున్నారు. వాళ్ళు కష్టపడుతున్నారు. వాళ్ళకు సరయిన జీతాలే లభిస్తున్నవని హృదయం కలవాడెవడూ అనలేడు. ప్రభుత్వానికి సానుభూతి ఉన్నది. కానీ, విభూతిలేని సానుభూతివల్ల ప్రయోజనమేమీ లేదు. ఇరుగో పేటపేటమీద ఇంతంత పన్నులు వెయ్యండి అని సెప్టెంబరులో మీరు చెప్పండి, పన్నుల రూపంలో మీరు ఇన్ని లక్షల రూపాయలు తవ్వవి — ఇందులోనుంచి గ్రామోద్యోగులకూ, ఉపాధ్యాయులకూ ఇవ్వండి అని మీరు చెప్పండి. అది బాగుంటుంది......"

శ్రీ సుందరయ్య:—ఆంధ్రప్రాంతంలోనే ఆదాయం రు 19 కోట్లనుంచి రు 30 కోట్లుఅయింది. అందులోనుంచి గ్రామోద్యోగులకూ, నాన్ గెజెటెడ్ ఉద్యోగులకూ మీరు ఎంత ఇచ్చారూ?

శ్రీ గోపాలరెడ్డి:—నూరి ప్రభుత్వానికి ఖర్చుకూడా ఎక్కువ కాలేదా? ఆరోగ్యసౌకర్యాలకోసం ఎంతఎక్కువ ఖర్చవుతుందీ? ప్రభుత్వ ఆదాయంలో ప్రకృతిసిద్ధమైన పెంపు వచ్చింది. అది ఎంత పకడ్బందీగా చేయగలిగే, జరిగిన పనులకు ప్రభుత్వాన్ని మీరు అభినందించండి. ఆ తరువాత జరగని పనుల సంగతి చెప్పండి. ప్రభుత్వం చేసిన పనులను గుర్తించకుండా విమర్శిస్తూంటే నిక్షకం గాడంటుంది. పబ్లిక్ వర్క్సు శాఖలోనూ, విద్యుచ్ఛక్తి శాఖలోనూ దుగా రాజ ఉగ్యాలో ందని నిమర్శిస్తున్నారు. నా ప్రవ వృక్షణం ఎలవటమనాలి. ప్రభుత్వ పనులలోని కష్టాలను సానుభూతితో చూడాలి."

# అంటువ్యాధులవల్ల 60 మంది మరణం

## ఆరోగ్యశాఖ డైరెక్టరు ప్రకటన

హైదరాబాదు, జూలై 29: ఈ నెల 20 వ తేదీతో అంతమైన వారంలో రాష్ట్రం మొత్తంమీద అంటువ్యాధుల వల్ల 60 మంది మరణించారని ప్రజారోగ్యశాఖ డైరెక్టరు ప్రకటించారు.

నిజామాబాదు జిల్లాలో కలరావ్యాధి ఉధృతంగా వ్యాపించింది. విశాఖపట్టణం, కరీమ్‌నగరమ్, మెదక్, నల్లగొండ జిల్లాలలో చెదురుగా కొద్దిమందికి ఈ వ్యాధిసోకింది. కృష్ణా, మహబూబ్ నగరమ్ జిల్లాలలో క్రొత్తగా కొంతమంది ఈ వ్యాధివల్ల బాధపడుతున్నట్లు తెలియవచ్చింది. వారంలో మొత్తం 108 మందికి కలరాసోకగా 29 మంది మరణించారు.

మశూచివ్యాధి ఈ వారంలో వ్యాపించలేదు. శ్రీకాకుళం, పశ్చిమగోదావరి,గుంటూరుజిల్లాలలో క్రొత్తగా ఎవ్వరికీ ఈవ్యాధి తగలలేదు. కృష్ణా జిల్లాలో మాత్రం కొద్దిగా వ్యాపించింది. విశాఖపట్టణం, తూర్పు గోదావరి, నెల్లూరు, కడప, చిత్తూరు, మెదక్ జిల్లాలలోను, హైదరాబాదు నగరంలోను చెదురుగా కొంతమందికి మశూచికం తగిలింది. మిగతా జిల్లాలో ఇది కనుపించలేదని తెలిసింది. వారంలో రాష్ట్రం మొత్తంమీద 110 మందికి ఈ వ్యాధిసోకగా 29 మంది చనిపోయారు.

ఈవారంలో శీతజ్వరంవల్ల 24, 844 మంది బాధపడ్డారు. వీరిలో ఇద్దరు మరణించారు. వ్యాధిగ్రస్తులకు ప్రజారోగ్యశాఖ తగిన వైద్య సదుపాయాలు కల్పించింది.

# మత్స్యపరిశ్రమ అభివృద్ధికి సంఘం

## ఏర్పాటుచేసే ఆలోచన

వరంగల్లు, జూలై 28: మత్స్య పరిశ్రమ అభివృద్ధికి సలహానిచ్చేనిమిత్తం అధికార, అనధికార, ప్రముఖులతో ఒక సంఘాన్ని ఏర్పాటుచేసే ఆలోచన కలదని వ్యవసాయ, మత్స్యశాఖల మంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డి నేడు జిల్లా మత్స్యపారిశ్రామికుల సహకార సంఘ సమావేశంలో చెప్పారు.

స్వీడన్, డెన్మార్కు, హాలెండు, దేశాలనుంచి ఏటా చేపలను ఎక్కువగా దిగుమతిచేసుకోవలసివస్తున్నదని,మత్స్య పరిశ్రమను మనదేశంలోనే అభివృద్ధి చేయవలసివున్నదని అన్నారు. వలలు, ఇతర పరికరాలు ప్రభుత్వం సరఫరా చేస్తున్నందున యీ సౌకర్యాలను వినియోగించుకోవలసిందిగా విజ్ఞప్తిచేశారు.

విద్యుచ్ఛక్తి శాఖామంత్రి శ్రీ జె.వి. నరసింగరావు ప్రసంగిస్తూ సహకార సంఘాలలో చేరి బలపరచాలని మత్స్య పారిశ్రామికులకు విజ్ఞప్తిచేశారు.

# 16 మంది గ్రామోద్యోగుల తొలగింపు

బందరు, జూలై 28: జమాబందీకి హాజరుకానందుకు 16 మంది గ్రామ కరణాలను ముగ్గురు మునసబులను ఉద్యోగాలనుంచి తొలగిస్తూ బందరు డిప్యూటీ కలెక్టరు ఉత్తర్వులు జారీ చేసినట్లు తెలిసింది. వీరంతా తమతమ ఫిర్కాల రెవిన్యూ ఇన్‌స్పెక్టర్లకు రికార్డులు వప్పగించారు.

మరో 38 గ్రామోద్యోగులకు తొలగింపు ఉత్తర్వు లివ్వనున్నారని తెలిసింది. ఈ విషయాలన్నీ జిల్లా, రాష్ట్ర, సంఘ కార్యవర్గాల సమావేశంలో రేపు చర్చిస్తారు.

# ఉపాధ్యాయులు: ప్రభుత్వ ఉత్తర్వు

## శాసనసభలో వాయిదా తీర్మానం తిరస్కృతి

హైదరాబాదు, జూలై 29: జిల్లా బోర్డు ఉపాధ్యాయులు ప్రత్యేకోద్యోగుల అనుమతి లేనిదే తమకు సంబంధించిన సంఘాలలో చేరరాదని ప్రభుత్వం ఇచ్చిన ఉత్తర్వువల్ల ఏర్పడిన పరిస్థితిని చర్చించడానికి సమావేశం వాయిదా వేయాలని శ్రీ కె. వి. యస్. పద్మనాభిరాజు తెచ్చిన తీర్మానం యీ మధ్య ఏర్పడిన సన్నిహిత సంఘటనకు సంబంధించినది కానందున అత్యవసరమైనది కాదని సభాపతి శ్రీ కాశీశ్వరరావు త్రోసిపుచ్చారు.

శ్రీ కాశీశ్వరరావు ఇలా చెప్పారు: "ప్రభుత్వం యీ ఉత్తర్వును గత సెప్టెంబరులో జారీ చేశారు. ఈ విషయంలోనే హైకోర్టు 1952 లో తీర్పు నిచ్చారు. భారత రాజ్యాంగంలోని 19 నిబంధన "సి" అంశం వ్యక్తులు ప్రాథమిక హక్కుల ననుసరించి వివిధ సంఘాలలో చేరే హక్కును తెలుపు తున్నది. అందులోనే నాలుగవ నిబంధన ప్రస్తుత చట్టములు, నిబంధనల ననుసరించి దానికి సహేతుకమైన నిషేధాలు లేక హద్దులను పెట్టవచ్చునని కూడా సూచిస్తోంది."

"ప్రస్తుతం ప్రభుత్వం జారీచేసినది సహేతుకమయిన నిషేధమా అన్నది ఒక ప్రశ్న. వారిచ్చిన ఉత్తర్వు హైకోర్టు తీర్పుకు వ్యతిరేకంగా వున్నదా అన్నది రెండవ ప్రశ్న. ఇవన్నీ న్యాయంగా విచారించాల్సి వున్నది. ఈ విషయమై ఇప్పుడు చర్చకు సమావేశాన్ని వాయిదా వేయడం శుభము గాదు. ప్రభుత్వ ఉత్తర్వు రద్దుగావాలని ఒక తీర్మానం సభవారివద్దకు తేవచ్చు. అత్యధిక సంఖ్యాకులు దానిని ఆమోదిస్తే దానిని అంగీకరించవచ్చు. ఇది ఈమధ్య జారీఅయిన ఉత్తర్వు గాదు. దాదాపు ఏడాది అవుతోంది. ఈ సమస్యతో నాకు సానుభూతివున్నా, గౌరవసభ్యుని తీర్మానానికి నేను అంగీకరించలేనందుకు విచారిస్తున్నాను. ప్రభుత్వనిర్ణయం సరికావచ్చు, తప్పు కావచ్చు. ఈ విరామతీర్మానాన్ని నేను అనుమతించజాలను."

# సిరిసిల్లా నియోజకవర్గం ఎన్నికపై దరఖాస్తు

## విచారణకు అధికారి నియామకం

హైదరాబాదు, జూలై 28: సిరిసిల్లా నియోజకవర్గంనుంచి ఆంధ్రప్రదేశ్ శాసనసభకు ఎన్నికైన శ్రీయుతులు అమృతలాల్ శుక్లా, కె. నరసయ్య ఎన్నిక చెల్లదంటూ శ్రీ అన్నం వెంకట నరసింహారెడ్డి దాఖలుచేసిన దరఖాస్తును విచారించేందుకు ఎన్నికల కమీషన్ నగరన్యాయస్థానం అదనపు చీఫ్ జడ్జి శ్రీ కె. ఉమాపతిరావునునియమించింది.

విచారణ హైదరాబాదులో జరుగుతుంది.

శాసనసభకు శ్రీ జె. ఆనందరావు ఎన్నిక చెల్లదంటూ శ్రీ అబ్దుల్ కరీమ్ దాఖలుచేసిన మరో దరఖాస్తునుకూడా శ్రీ ఉమాపతిరావు విచారిస్తారు.

ఎన్నికల కమీషన్ మరో ప్రకటన ద్వారా శ్రీ కె. రాజమల్లు ఎన్నికను త్రోసిపుచ్చాలని శ్రీ సంజీవరెడ్డి దాఖలుచేసిన దరఖాస్తును పరిశీలించేందుకు సికింద్రాబాదు జిల్లా జడ్జి శ్రీ మరఫుద్దీన్ అహమ్మద్ ఖాన్ సిద్దీకిని నియమించింది.

ఈయన ఈ దరఖాస్తును సికింద్రాబాదులోనే విచారిస్తారు.

బొలారంలోని రాష్ట్రపతి నిలయంలో- రాష్ట్రపతితో బంజారా (సుగాలీ లేక లంబాడీ) ప్రతినిధివర్గం.

# వ్యవసాయదారుల ఋణ నివారణ

## దరఖాస్తులకు వ్యవధి పొడిగించే అవకాశం

హైదరాబాదు, జూలై 27: హైదరాబాదు వ్యవసాయదారుల ఋణ నివారణ (సవరణ) ఆర్డినెన్సు రద్దు చేయడానికి, హైదరాబాదు వ్యవసాయదారుల ఋణ నివారణచట్టం సవరణచేయడానికి ఒక బిల్లు ఈరోజున ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ అసాధారణ గెజెట్‌లో ప్రచురితమైనది.

బిల్లు లక్ష్యాల వివరణలో ఇలా ఉన్నది: వెనుకటి హైదరాబాదు శాసన సభ చేసిన హైదరాబాదు వ్యవసాయదారుల ఋణ నివారణ చట్టం 1956 అక్టోబరు 8 వ తేదీని అమలులోనికి వచ్చినది. చట్టం అమలులోనికి వచ్చిన మూడు మాసాలలోగా - 1957 జనవరి 2 వ తేదీ - ఋణాలు ఇచ్చినవారు తీసుకొన్నవారు తమ ఋణాల పరిష్కారానికి దరఖాస్తులు పెట్టుకొనడానికి ఆ చట్టం వ్యవధి ఇచ్చినది. అయితే ఆదరఖాస్తులు పెట్టుకొనడంలో అవలంబించవలసిన పద్ధతి నిర్ణయిస్తూ చట్టక్రింద నిబంధనావళి తయారుచేయడం జరుగలేదు. చట్టక్రింద అనుమతించిన వ్యవధి ముగిసేలోగా నిబంధనావళి తయారు చేయడం సాధ్యంకాదని కూడా తోచినది. అందువల్ల దరఖాస్తులు పెట్టుకొనడానికి వ్యవధి పొడిగించడం అవసరమని వెనుకటి హైదరాబాదు ప్రభుత్వం అభిప్రాయపడినది. చట్టం సవరణచేసి, ఋణాల పరిష్కారానికి దరఖాస్తులు పెట్టుకొనడానికి వ్యవధి పొడిగించే అధికారం పొడిగిస్తూ ఆర్డినెన్సు జారీ చేయడమైనది. కాని, భారత రిపబ్లిక్ అధ్యక్షుని అనుమతి పొందకుండా రాజప్రముఖ్ ఆ ఆర్డినెన్సు జారీ చేసిన కారణంచేత అది చెల్లదని కొందరు ఆక్షేపణ తెలియపరచారు. అందువల్ల ఆ ఆర్డినెన్సు రద్దుచేస్తూ చట్టం చేయాలని ప్రభుత్వం సంకల్పించినది.

ఈ బిల్లు మొదటి చట్టాన్ని కూడా సవరణ చేస్తున్నది. ఈ సవరణ ననుసరించి ఋణాల పరిష్కారానికి దరఖాస్తులు పెట్టుకొనే నిమిత్తం మొదటి చట్టంలో సూచించిన విధంగా 'మరి మూడు నెలలవరకు' కాక ప్రభుత్వం నిర్ణయించే కాలంవరకు వ్యవధి పొడిగించడానికి అధికారం ఉంటుంది.

# ఉద్యోగులూ- ఉద్యోగాలూ

హైదరాబాదు, జూలై 28: శ్రీ ఎం. ఎ. హమీద్, శ్రీ జె. వి. భట్ స్థానంలో మహబూబు నగరం జిల్లా కలెక్టరుగా నియుక్తులై పదవిని స్వీకరించారు.

శ్రీయుతులు టి. రామచంద్రరావు, మీర్ ఇల్లియాస్ అలీ శాశ్వతికజిల్లా పంచాయతీ అధికారులుగా నియుక్తులయ్యారు.

కడప ప్రాంతీయ రవాణా శాఖాధికారి శ్రీ హైదరాలీఖాన్ పశ్చిమ గోదావరిప్రాంతీయ రవాణా శాఖాధికారిగా నియుక్తులయ్యారు.

పశ్చిమగోదావరిప్రాంతీయ రవాణా శాఖాధికారి శ్రీ జె. అప్పారావు కడప ప్రాంతీయ రవాణా శాఖాధికారిగా నియుక్తులయ్యారు.

విద్యాశాఖ డైరెక్టరు డాక్టరు ఎస్. రామ్‌లాల్ ఉద్యోగరీత్యా ప్రభుత్వ పరీక్షలకు, ప్రభుత్వ గ్రంథాలయాలకు కమీషనర్ గాకూడా వ్యవహరిస్తారు.

# మైకా వ్యాపారానికి లైసెన్సు రుసుం

హైదరాబాదు, జూలై 28: రాష్ట్ర శాసనసభ ప్రస్తుతం పరిశీలిస్తున్న మైకా బిల్లులో మైకా వ్యాపారస్తులు (బ్రోకర్లు) అనుమతి పొందడానికి (లైసెన్సు) రుసుముగా 300 రూపాయలు చెల్లించాలనే నిబంధన ఉన్నదని, దానివల్ల వ్యాపారస్తులకు విశేషమైన ఇబ్బంది కలుగుతుందని సూచిస్తూ శాసన సభ్యులు శ్రీ పి. గోపాలకృష్ణారెడ్డి, శ్రీ కె. శ్రీనివాసులురెడ్డి రాష్ట్రప్రభుత్వ ముఖ్యమంత్రికి ఒక వినతిపత్రం సమర్పించారు.

మైకా వ్యాపారస్తులు (బ్రోకర్లు) పేదవారు. అక్షరజ్ఞానం లేనివారు. శేరాలు వదిర్చి కమిషన్ సంపాదించి దానితో పొట్ట పోసుకుంటున్నవారు. బిల్లులో సూచించినట్లుగా వారు లెక్కలు తయారుచేయాలని నిర్బంధించడంకూడా తగదని ఆ వినతి పత్రంలో సూచించడమైనది.

# జంట నగరాలకు పాల సరఫరా

## సహకార పద్ధతిపై రు20 లక్షల పథకం

హైదరాబాదు, జూలై 28: హైదరాబాదు, సికిందరాబాదు నగరాలకు సహకార పద్ధతిపై పాలు సరఫరా చేయడానికి సహకార సంఘాల రెజిస్ట్రార్ ఒక పథకం తయారు చేశారని, దానిని అమలు పరచడానికి నాలుగు సంవత్సరాలకు 20, 25,000 రూపాయలు ఖర్చు అవుతుందని రాష్ట్ర ప్రభుత్వ వ్యవసాయశాఖా మంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డి శాసనసభలో శ్రీ ఎస్. కాశీరెడ్డి ప్రశ్నకు సమాధానంగా చెప్పారు. పశుసంరక్షణశాఖ జంటనగరాల పాల సరఫరాకు ఎట్టి పథకము తయారుచేయలేదని కూడా ఆయన సూచించారు.

సహకార సంఘాల రెజిస్ట్రార్ తయారు చేసిన పథకం వివరాలు ఈ క్రిందివిధంగా ఉన్నవి: హైదరాబాదు, సికిందరాబాదు నగరాలలోను, పరిసర గ్రామాలలోను దాదాపు 200 పాల ఉత్పత్తి సంఘాలు స్థాపించడం జరుగుతుంది. ఒక్కొక్క సంఘము 200 పౌన్లుపాలు ఉత్పత్తి చేయగలిగి ఉంటుంది. ఈ సంఘాలు ఉత్పత్తి చేసిన పాలుతీసుకొని,'పాస్చరైజ్' చేసి,జంట నగరాలలోని ప్రజలకు సరఫరా చేయడానికి ఒక సహకార సంఘం ఏర్పడుతుంది. ఉత్పత్తి సంఘాలు స్థాపించిన గ్రామాలలో సభ్యులు అందరికి చెందిన పశువులకు పాలుపితుకడానికి శాలలు ఏర్పాటు చేయడం జరుగుతుంది. ప్రాథమిక సంఘాలు ఉత్పత్తి చేసిన పాలు సేకరించడానికి ప్రతి పది ఉత్పత్తి సంఘాలకు ఒకటి చొప్పున కేంద్రాలు నెలకొల్పడం జరుగుతుంది. ఆ కేంద్రాలలో పాల నాణ్యం పరీక్షించడానికి తగు పరికరాలు సిబ్బంది ఏర్పాటు చేయడం అవుతుంది పాల సరఫరా సంఘానికి 'పాస్చరైజేషన్' యంత్రాలు, పాలు చల్లారజేసే యంత్రాలు, కోల్ట్ స్టోర్, సీసాలలో పాలుపోసే యంత్రం, పాల పరీక్షకు పరిశోధనాలయం, వలసిన భవనాలు సమకూర్చడం జరుగుతుంది. పాలు ప్రజలకు వేగంగా సరఫరా చేసేనిమిత్తం తగినన్ని వాన్సు, సైకిళ్లు, సంఘ వ్యవహారాలు నిర్వహించడానికి తగు సిబ్బంది అవసరం. పాలు బాగా ఇచ్చే పశువులు కొనడానికి ఉత్పత్తి సంఘాల సభ్యులకు ఋణాలు ఇవ్వడము, మేత సరఫరా చేయడము కూడా అవశ్యకం.

# విశ్వనాధ రామాయణోత్సవాలు

ఖమ్మంమెట్టు, జూలై 28: 'శ్రీ విశ్వనాధ రామాయణోత్సవాలు' ఆగస్టు 9 తేదీ సాయంత్రం నుండి, 11 తేదీ సాయంత్రంవరకూ జరపడానికి ఉత్సవ నిర్వాహకసమితి నిశ్చయించింది. 9 తేదీ సాయంత్రం శ్రీ మద్రామాయణ మహాకావ్యం ఊరేగింపును పెద్దయెత్తున జరపడానికీ, ఆనాటి సమావేశ ప్రారంభకులుగా డా॥ భోగరాజు పట్టాభిసీతారామయ్యగారిని ఆహ్వానించడానికీ యేర్పాట్లు జరిగినవి, ప్రతిరోజూ ఉదయం, సాయంత్రం, కావ్యాన్ని గురించి, కవి పండితుల అభిప్రాయాలు, కృతికర్త ఉపన్యాసాలూ వుంటాయి. శ్రీయుతులు,ధూళిపాళ శ్రీరామమూర్తి, జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి, హరిత శివశర్మ, పాటిపల్లి సీతారామారావు, దివాకర్ల వెంకటావధాని, దేవులపల్లి రామానుజరావు, విశ్వనాధ వెంకటేశ్వర్లు, యనమంద్ర ఆదినారాయణశర్మ, జె. గౌతమరావు, కేతవరపు రామకోటిశాస్త్రి, దిగుమర్తి సీతారామస్వామి, మల్లంపల్లి, ప్రభృతులను ఇతర ప్రముఖ సాహిత్య ప్రియులను ఆహ్వానించడానికి ప్రస్తుతం ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగుతున్నాయి. ప్రతిదినం రామాయణ కావ్యంలోని రసవత్తర ఘట్టాల గానం వుంటుంది.

ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖా మంత్రి శ్రీ యస్. బి. పి. పట్టాభి రామారావు, ఆర్థికామాత్యులు శ్రీ బెజవాడ గోపాలరెడ్డి గారలకు, కవిసమ్మేళనం, కృతికర్త సన్మాన సమావేశాలకు అధ్యక్షత వహించడానికి ఆహ్వానాలు అందజేశామనీ, వారుకూడా అంగీకరించగలరని తాము ఆశిస్తున్నామనీ నిర్వాహకులన్నారు.

ఖమ్మం పట్టణంలో చారిత్రక ప్రాముఖ్యం కలిగించే యీ మహోత్సవాలకు ప్రతి ఆంధ్రుడూ సాహిత్యప్రియుడూ, ఉదార హృదయంతో యథాశక్తి తోడ్పడాలనీ నిర్వాహక సమితి విజ్ఞప్తిచేసింది. (స్వ. వి.)

# ఈనాం రైతులకు పట్టాలివ్వాలి

## తాడేపల్లి గూడెం తాలూకా కాంగ్రెసు విజ్ఞప్తి

తాడేపల్లిగూడెం, జూలై 27:— రాష్ట్రంలో ఉన్న ఈనాములన్నింటినీ రద్దుచేసి వాటిని సాగుచేస్తున్న రైతులకు జిరాయితీ పట్టాలు ఇప్పించాలనీ, సామ్యవాద సమాజనిర్మాణానికి ప్రాతిపదికగా సాధ్యమైనంత త్వరలో భూసంస్కరణలను అమలు జరపాలనీ తాలూకా కాంగ్రెసు సంఘం ఈ

# పాతపట్నం తాలూకా బంజరు భూములు

## హరిజన మహాసభ విజ్ఞప్తి

మెట్టూరు, జూలై 28: సాగుచేయటానికి వీలైన బంజరుభూములలో వ్యవసాయకూలీ సహకార సంఘాలను ఏర్పాటుచేసి పేదహరిజనులకు స్థిరమైన వృత్తికల్పించాలనీ, బత్తిలి, నివగాం గ్రామాలలో సహకారపద్ధతిపై నేత పారిశ్రామిక సంఘాలను నెలకొల్పాలనీ నిన్న ఇక్కడ జరిగిన తాలూకా హరిజన మహాసభ ప్రభుత్వాన్ని కోరింది.

మహాసభకు శాసనసభ్యుడు శ్రీ లుకులాపు లక్ష్మణదాసు అధ్యక్షత వహించారు. తాలూకాలోని పలు ప్రాంతాలనుంచి రెండువందలమంది హరిజన ప్రతినిధులు, వెయ్యిమందికి

గోలున ఇక్కడ సమావేశమై విజ్ఞప్తి చేసింది.

సమావేశానికి శ్రీ తుమ్మలపల్లి సత్యనారాయణమూర్తి అధ్యక్షత వహించారు. శ్రీయుతులు నెలగల దానిరెడ్డి, వేమూరి గోపాలకృష్ణమూర్తి, నడింపల్లి వెంకట్రాజు మొదలైనవారు హాజరయ్యారు.

ఈ సంవత్సరం అక్టోబరు 1 వ తేదీ నాటికి ఈ పట్టణానికి పురపాలక సంఘాన్ని ఏర్పాటుచేయాలనీ, భూములు మంజూరుచేసిన రాజకీయ బాధితులకు పది వాయిదాలతో తీర్చుకునే పద్ధతిని రూ 1000 చొప్పున అప్పులు ఇప్పించాలనీ, ధాన్యం ధరలు విపరీతంగా పెరిగిపోయినందున తాలూకాలో చౌక విక్రయశాలలు నెలకొల్పాలనీ సమావేశం ప్రభుత్వాన్ని అభ్యర్థించింది.

పైగా శ్రీ కేసుపూ హాజరయ్యారు. జిల్లా గిరిజన సేవాసంఘం అధ్యక్షుడు శ్రీ బి. ఎం. రెడ్డి, తాలూకా కాంగ్రెసు సంఘం అధ్యక్షుడు శ్రీ వి. జగన్నాథం. శ్రీయుతులు కె. హరికృష్ణ చౌదరి, ఎం. అప్పన్న ప్రభృతులు కూడా వచ్చారు.

తాలూకా హరిజనసంఘం అధ్యక్షుడు శ్రీ ఎ. అప్పలస్వామి సభికులకు స్వాగతం చెప్పారు.

మహాసభను ప్రారంభిస్తూ శ్రీ బి.ఎం. రెడ్డి హరిజనులు హక్కులకోసం ఆందోళన చేయటంతోపాటు బాధ్యతలనుకూడా స్వీకరించాలనీ, అప్పుడే నిజమైన అభివృద్ధిని సాధించటానికి వీలు కలుగుతుందనీ సలహా చెప్పారు. శ్రీ హరికృష్ణచౌదరీ మాట్లాడుతూ హరిజనులు, గిరిజనులు స్నేహంగా మెలగాలన్నారు. సభాధ్యక్షుడు హరిజనుల పురోభివృద్ధికి ప్రభుత్వంచేస్తున్న సహాయాన్ని వివరించి ఆర్థికపరిస్థితులను బాగుచేసుకునేందుకు నిర్మాణాత్మకమైన పథకాలను రూపొందించుకోవాలని సలహా చెప్పారు.

బత్తిలి, బాలేరు గ్రామాలలో సహకారపద్ధతులపై చేనేత పారిశ్రామిక సంఘాలను నెలకొల్పాలనీ, తగినచోట హరిజనులకు గృహవసతులు కల్పించాలనీ, మహాసభ ప్రభుత్వానికి విజ్ఞప్తి చేసింది.

తాలూకా హరిజనసంఘానికి దిగువ సభ్యులతో కార్యవర్గం ఎన్నికైంది.: శ్రీయుతులు ఎ. అప్పలస్వామి (అధ్యక్షుడు), ఎ. పవరయ్య (ఉపాధ్యక్షుడు), పి. గురయ్య (కార్యదర్శి), సంజీవి, జె. తెల్లయ్య, జి. నీలమణి, ఎ. అప్పన్న, ఎ. చిన్న రామన్న, పి. దండాసి, జి. గురయ్య, పి. సొట్టన్న, టి. గోపన్న (సభ్యులు)











Printed and Published for Nageswaar Rao Estates (private) Ltd., by S. Radha Krishna, at The Andhra Patrika Press, 6 & 7 Thambu Chetty St., Madras-1. Editor S. Sambhu Prasad.